సరస్వతీ గ్రంథమండలి : అనుబంధమాలిక ౨౧

# నీతిప్రబోధిక

గ్రంథకర్త :

పగడాల కృష్ణమూర్తినాయుడు



సరస్వతీగ్రంథమండలి

రాజమహేంద్రవరము

# నిబంధనలు

---

౧. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా రు ౦—౪—౦ లు చెల్లింపవలయును.

౨. ఇందుఁ జేరు స్వదేశీ మాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికో బైండుగల ప్రతిగ్రంథమును రు ౧—౦—౦ వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

౩. గ్రంథములఁ బంపుట కగు పోస్టేజి మొదలగు ఖర్చులన్నియును జందాదారులే భరింపవలయును.

౪. చందాదారులగువారు వెనుకటి గ్రంథము లన్నియును గొనవలయునను నియమములేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములు కూడ, జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

౫. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరిన వారికే పంపుచుందుము.

౬. సంవత్సరము చందా అనగా ముందు ప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు ౭—౨—౦ లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములవఱకు ప్రతిపుస్తకమును అన్ రిజిస్టర్డు పార్సిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు చెల్లింపవలసిన మనిఆర్డరుకమీషను ౦—౧౨—౦ లును రిజిస్టరు ఖర్చు ౦—౧౨—౦ లును రు ౧—౮—౦ లు కూడివచ్చును.

# నీతిప్రబోధిక

[illegible]:

పగడాల కృష్ణమూర్తినాయుడు



సరస్వతీగ్రంథమండలి

రాజమహేంద్రవరము

# విషయసూచిక



శ్రీరామచంద్రాయనమః

# పండితాభిప్రాయములు.



శ్రీమదాంధ్ర విద్యావాచస్పతి,
సాహిత్యసరస్వతి విద్యావినోద,
కవిభూషణ, శతావధాని శ్రీదోమా
వేంకటస్వామిగుప్తగారు.

క్రిష్టియన్ కాలేజి,
జి. టి. మద్రాసు
24—1—32

మ, రా. రా. శ్రీ పగడాల కృష్ణమూర్తినాయఁడుగారికి—
మిత్రము దోమా వెంకటస్వామి గుప్తవ్రాయులేఖ.

మీరు పరిశీలనాభిప్రాయార్థము పంపియుండిన "నీతిప్రబోధికం" గాంచితిని. దానిని వ్రాసిన మీ నైపుణిని గూర్చి యిప్పుడు మ. రా. రా॥ శ్రీ పూ. శ్రీరాములు రెడ్డిగారివంటి నిష్పక్షపాతహృదయుఁడు మెచ్చెనో యితరులయొక్క యభిప్రాయంబు లనేకంబులు తాము సంపాదించినట్లే. మిత్రరత్నమా! మీ పొత్తమును మొదటఁ దెఱచినప్పటిలో నా కడకు నప్పుడప్పు డభిప్రాయార్థము వచ్చువానివంటిదే యిదియునని నాల్గుపుటలు తిరుగవైచి యాచారప్రకారముగా నేదో యొక యభిప్రాయము వ్రాయవలసి యుండునని తలంచితిని. కాని కొంతచదివిన తరువాత—ఆకతలు నేనొకఁడనే చదువుటగాక మాపాఠశాలలో నొక క్లాసులోఁ జదివి బాలకులను సంతోషపెట్టఁగల్గితిని. ఇంటిలో బాలకులకును ఆఁడువారికిని సంతోషకరముగాఁ జదివితిని. ఈపుస్తకము జగదుపయోగకరం బనుట కెట్టిసందేహంబు నుండదు. త్వరలో ముద్రితంబై యిలలో వ్యాప్తినొందును గాక—

శా. ఆమూలాగ్రము గాంచుదాఁక మదికన్యాక్రాంతి రానీక యొం
తే మోదంబును గల్గజేయుఁ గరమున్నీతి ప్రబోధాభిధం

కామీపాత్రము పెద్దవారలకె; యిట్లెయొప్ప. బాలాళికిన్
సామంజస్యముగాదె యిద్దియెలయున్ సంపాద్యమై యంచనన్.

ఉ. పేరులఁజాలఁ దాల్చియును, బెద్దలమంచును నిక్కువారలన్
వారలతప్పులెన్నుచును, బాలకపాళికి నింబురోమతి
శ్రీరుచిగొల్పుచుం గరముఁజెన్నలరారెడి నీదుపాత్రమెం
తేరహిఁ గృష్ణమూర్తి! యిటులే రచియింపుమిఁకం గృతుల్ తగన్

మిత్రము

(Sd) దోమా వెంకటస్వామిగుప్త

ఒక్కపరి మహోన్నతదశ ననుభవించి రాజాధిరాజమకుటాంగద రత్నరాజి నీరాజనంబుఁ గొని భాషాతత్త్వవేత్తలగు విద్వత్కవుల నిరంతర సేవాంజలుల సంతోషస్వాంతయై వివిధవర్ణ సుమసందోహ హారాలంకృతయై యాశ్రితజనచింతామణియై వెలుఁగొందు భాషామతల్లి కాలగతిఁ గొంతభిన్నత వహించి యిప్పుడిపుడే హాసోదంచిత ముఖారవిందయై భాసిల్లెడిని.

పూర్వకవి చంద్రు లనేకులు గీర్వాణగ్రంథము లనేకముల నాంధ్ర భాషలోని కనువదించియు స్వకపోలకల్పిత గ్రంథములఁ గొన్నిటిని రచించియు, భాషాపతి యనుగ్రహమునకుఁ బాత్రులైరి. అందు, నయశాస్త్రపారగులగు భర్తృహరియు, విష్ణుశర్మయు, నాదిగాగల మహామహులట్టి యనువాదమునకుఁ గడంగక సమగ్రంబగు శబ్దశాస్త్రమును సాంఖ్య, తర్కవేదాంతశాస్త్రములఁ జక్కని పరిజ్ఞానముగల్గి మన్వాదిస్మృతుల నవలోకించి బాలుర సన్మార్గప్రవర్తనమునకే గాక పండితుల హృదయాహ్లాదనమునకును స్థానములగు నట్లింపగు శైలిఁ బంచతంత్రసుభాషితములను నీతిదాయకగ్రంథముల రచించిరి. ఇంకను నట్టిగ్రంథములు వెలువడుట బాలురపురోభివృద్ధికిఁ గారణములై యుండు.

ఇటీవల మత్సుహృదులును నాంధ్రభాషాభిలాషులును నీతివర్తనులును నగు శ్రీయుతులు, ప. కృష్ణమూర్తినాయఁడుగారిచే రచింపఁబడిన నీతిప్రబోధిక అను, పాఠ్యముఁజూడఁ గల్గితిని. ఇది బాలుర సత్ప్రవర్తనమునకును ప్రపంచ జ్ఞానమునకును నాలవాలములగు విషయవిభజనఁగల్గి తత్తద్విషయ నిరూపణకై పరిమితములును, సందర్భోచితములును నగు వాక్యజాలముల కనువగు సొంపులుగుల్కు కథలం గల్గి మధురశైలి న్విరాజిల్లెడి యొకగ్రంథము. రసవంతములగు సామెత లందందుఁ జొంపపఱుపఁబడి యున్నవి. వీరాంగ్ల మభ్యసించినవారయ్యు నింతటి యాంధ్రభాషాభిమానము గల్గి సలక్షణముగ నిట్టి నూతనవిధానమున బాలురజ్ఞానాభివృద్ధికై నీతిప్రబోధమగు నీ గ్రంథమును మధురశైలిని రచించి, సేతుబంధన క్రియానిర్వహణమ్మున సీతాపతికిఁ దోడ్పడిన యుడుతవలె సారసగర్భరాణి సేవకుఁ దమశక్తికొలఁదిఁ బ్రయత్నించు నుత్సాహమెంతయు శ్లాఘాపాత్రము.

సదసద్వివేకమునకు శైశవము చాలముఖ్యమైనది. బాలకులు ప్రథమమున నిట్టి పాఠ్యములఁ జదివిన పరోపకారాది యుదారగుణవంతులును నీతివర్తనులును నగుటయే గాక భాషయందభిరుచిగల్గి యింకను నుత్తమ గ్రంథములఁ జదువ నపేక్షగలవారగుదురు.

తే. గీ. చిన్ననాటివిద్య చిరకాలముండును
రమ్యమగు శిలాక్షరక్రమమునఁ
బెద్దపెరిఁగి చదువఁబెంపార నంటదు
నీటిలోనవ్రాఁత నిలువనట్లు.

జగత్కల్యాణసంధాయకుఁడగు చంద్రశేఖరుఁడు గ్రంథకర్త కిట్టి యుత్సాహమును నాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించుగాక.

ఇట్లు విధేయుడు
(Sd) టి. నాగేశ్వరయ్య
తెలుగు పండితులు
బోర్డు హైస్కూలు

చిత్తూరు
7—1—32

భాషలు బహుముఖముల విస్తరిల్లుచున్నవి. దినాయుష్కములు వారవయస్కములు, పక్షప్రాణపరిమితములు, మాసజీవితనియతములు, వత్సరవయోవృద్ధములు నగు పద్యగద్యములు లెక్కకుమీఱి సృష్టియగుచున్నవి. తత్సృష్టికర్తలకు ప్రాఁతికంటె నామకరణమునఁ గడుంగడుఁ గష్టము గల్గుచున్నది. వార్తాపత్త్రికల యందచ్చుపడి వెలువడిన పద్యగద్యముల కాదినముతో నాయువంతరించుచున్నది. ఒకపరి చదివిననవలను మఱొకసారి చదువువారు లేరు. అవికూడ నిప్పుడు విశేషించి భాషాభివృద్ధికై వ్రాయఁబడుచుండుటలేదు.

వాచకములు నుపవాచకములు నసంఖ్యాకములైనవి. వానివృద్ధి వ్యాపారవృద్ధికిఁ దోడుపడినవి. అభిమానములవలన, సిఫారసులవలన, నత్రికతరువులవలనఁ, గుండెమార్పులవలన నవి కర్చగుచున్నవి. వీనివలన నెంత మాత్రము భాషాభివృద్ధి యగుచున్నదో విజ్ఞుల కెఱుకయగుచునే యున్నది.

వాచకములలోఁ బెక్కులొకయచ్చునఁ దీసిన ముచ్చులే. మొత్తము మీఁద విషయమొక్కటియే యగుచుఁ బదభేదములచేఁ బాఠములముందు వెనుకల మార్పులచే నేర్పడుచున్నవి. నాలుగువాచకపుస్తకముల దగ్గఱ నుంచుకొన్నచో నాలుగుదినములలో నొక క్రొత్తపేరుగల వాచకసంపుటములు వెలువరింపవచ్చును.

ఉపవాచకముల (Non-details) సంగతి యింకఁ జెప్పనక్కఱయే యుండదు. భారతకథలు, భాగవతకథలు, రామాయణకథలు, పంచతంత్రహితోపదేశకథలు తక్కఁ బ్రపంచమున నింకఁ గథలే లేవేమో యను సంశయమీ యుపవాచక సమితింగాంచిన వారికిఁ దోఁపకమానదు. వీనిలోఁ దొంబది తొమ్మిదిపాళ్లు వత్సరవయోవృద్ధములే. అయినను ఈ తాలూకాలో నొకయేఁడా తాలూకాలో నొకయేఁడు, ఒకజిల్లాలో నొకవత్సరము మఱియొక మండలమున నొక హాయనముగాఁ దద్రచయితలా గ్రంథపత్త్రికల కాయుర్దాయము నొసఁగుచున్నారు. వెలతక్కువ ఓలి యెక్కువ యగునవి యొకవిధమున గ్రహదోషములనుండి గట్టెక్కి కొంతయాయువుఁ బడయుచున్నవి. భాషామతల్లికీ పులిపిరి రోఁత యెప్పు డంతరించునో తెలియనైతి.

పాడినచో పాడరా పాఁచిపండ్ల దాసరీయను రీతినిగాక గ్రంథము భాషకొక సూక్ష్మాలంకారముగ నుండవలయు. సత్యము పలుకుము అను నీతి కను జెప్పిన మాత్రమునకే హరిశ్చంద్రుని కథయూ బలిచక్రవర్తిచరిత్ర-మాయని బాలకులూహించి యొకటేవాక్యము మాత్రము చదివి పుస్తకము మడిచి బల్లపై నుంచఁదగినట్లుండరాదు. పాండిత్యప్రకర్షకై తాము చదివిన సంస్కృతనాటకములలోని శ్లోకములకు చెవిలు తెనుఁగుచేసి బాలురకు నుపాధ్యాయులకుఁగూడ "నిదియేమిభాష! ఇదియేమి వాక్యపద్ధతి! ఇతఁ డొక టిన్నరసపండితుఁ"డను భావము పొడమునియరాదు. సందర్భశుద్ధియుఁ దరగతికిఁ దగిన శైలియు నుండవలయు. నే నొకపరి యాఱవతరగతి బాలురకు బాలికలకు—కామాంధకము— అనుపదమునకు సరియగునర్థము చెప్పఁజాలక మిణకరించితిని. విద్యార్థులశక్తిని యోగ్యతను గమనింపనిరచనమున నిట్టి చిక్కులు కలుగును. భావములు బాలకుల కోమలహృదయముల నంటి పీడకుండునట్టి మార్దవములగు పదజాలముఁ గలిగి కటుసమాసములకు దూరమైయుండవలయు. "తొల్లి హిరణ్యాకశిపుఁడను రాక్షసరాజొకఁడుండెను. అతఁడు శాపవశమున నసురుఁడయ్యెను" అని యొక కావ్యకర్తలు వ్రాసిరి. దీనిం జదువఁగా "ఖాదరుసాహెబు పొరపాటునఁ బురకలలోఁ గలిసిపోయెను" అను సాక్షివాక్యము జ్ఞప్తికి వచ్చినది. గ్రంథలక్షణముం గూర్చి చెప్ప దొరకొన్న నొకగ్రంథమే కాఁగలదు. కాన నిక్కృత్యాంతము నింతటితో విరమించుచున్నాఁడను. ఈవిషయముం గూర్చి "విద్యమానవిద్యావిధాన" మనుశీర్షికతో భారతియను మాసపత్రికయందు విస్తరించిన నా వ్యాసమును జూడనగును.

నా మిత్రులగు వ. కృష్ణమూర్తినాయుఁడుగారు శిశుప్రబోధికయను పదికథల సంపుటమును వ్రాసిరి. వారికి నా యుద్దేశములన్నియు విదితములే కావునఁ గొంతవఱకు వానిని మనసున నుంచుకొని వ్రాయఁగలిగిరి.

ఒక్కొక్క కథకు మొదట నుపోద్ఘాతముగా గుణవిమర్శనముఁ జేసి యున్నారు. ఆ భాగములు సాక్షివ్యాసముల శైలిని బోలుచున్నవి: కాని యంత ప్రౌఢభావసంయుతములు కావు. ఒకవిషయమును బాలురకు బోధిం-

పదలకొన్ని దానిని నాలుగువిధముల వాక్యములతో హృదయక్షేత్రమున
నాటింపసమర్థములై యున్నవి. అంత్యనియమములకై యొండు రెండు
చోట్ల మాటుమాలపదములు వాడఁబడినను శైలి బాలకుల కాహ్లాదకర
మైనది ఎల్లప్పుడుగలదే యెల్లమ్మజాతర యనునట్లు కథలు ప్రాఁతవికాక
క్రొత్తవి. కథ సంపూర్తి యగువఱకు దానిపోకడ కాని ముగింపిచ్చుటనని
కాని యెఱుఁగరాదు. ప్రతికథకు మకుటముగ నొక నీతిపద్యము సంఘటిం
పబడినది. కథలు కొన్ని యమానుషములు. ఒండు రెండుమృగ పక్షులకు
సంబంధించినవి. అట్లయ్యు భావములు మనుజస్వభావము
ననుసరించి బాలకుల మనస్సుల కొకవిధమగు మనోజ్ఞకసంచలనము గలి
గించి సన్మార్గమునకుఁ ద్రిప్పఁజాలి యున్నవి. మొదటికథలో శుక్లాంబరధ
రం విష్ణుం, టెంకాయ తీసికొనిరా శశివర్ణం చతుర్భుజం, తాంబూలము
దక్షిణపెట్టు ప్రసన్నవదనం ధ్యాయేత్. పడిబియ్యము తీసికొనిరా సర్వవి
ఘ్నోపశాంతయే. చెంబుతో నీళ్ళింకను తేలేదేమి? యను పౌరోహితుని
ధోరణిని మనవారు దైవారాధనము చేయుటచు జక్కఁగా ఖండింపఁబడి
నది. భక్తిలేనిపూజ పత్రిచేటేకదా! సుమతీ సుధర్మలయతిథి పూజ యిందుఁ
బవిత్రతరమైనది రచయిత యిందు దుర్మార్గులకుఁ దగుశిక్ష విధింపవలయునని
మాత్రమే తలఁచెగావలయు, అంతకంటె దుష్టులగు మారీపురవాసుల హృద
యముల సుదతీసుధర్మలవలన మార్పు నొందించి యుండిన నెంతయు సమం
జసమై యుండెడిది. రెండవకథ యందనంతమ్మ యసూయస్వాభావికో
క్తులతో వివరింపఁబడినది. శాంతయ్య శాంతిస్వభావ ముత్తమోత్తమమైనది.
దురాశాఫలమిట్టిదని కథ తుదిని హాస్యరీతిని వక్కాణించు చున్నది.

మూడవకథలో బాలురయొక్కయు నితరులయొక్కయుఁ జెడునడ
వడులు స్వాభావికోక్తులచేఁ దిరస్కరింపఁబడి యుండుటను జదివియే యా
నందింపఁదగు. ఒక యైంద్రజాలికుఁడు రాంచీనగర రాజపుత్రున కొక
యుంగరమిచ్చి దానిచే నతని దుర్గుణముల మాన్పఁబ్రయత్నించుట రామణీ
యకపద్ధగ నున్నది. రాకుమారుఁడు పొందినరూపములు ధర్మబోధనాసమ
ర్థములై యొప్పుచున్నవి. నాలవకథయందు దైవమాయయను శీర్షికతోఁ

ప్రాపంచికధర్మములు చిత్రరీతిని వర్ణింపఁబడినవి.

ఐదవకథలో రైలుబండి స్నేహము మున్నగు చిత్రవిచిత్ర నవనాగరకతా స్నేహముల వైఖరిని దెలుపుచున్నది. ఇందలి విశ్వాసమను కుక్కకథ జాలిని పుట్టించును.

ఆఱవకథలో సర్వసాధారణములైన యసత్యములు వివరింపఁబడి ఖండింపఁబడినవి. అసత్యదోషమున సర్పరూపుఁడైన రాకుమారుఁడు సత్యవతి యను కన్యకచే నుద్ధరింపఁబడుట యిందలికత. ఏడవకథ యందాశ యనంతమనుటకనేకోదాహరణములచే నిరూపింపఁబడి "నిరాశాపరమం సుఖమ్మను" తీరుమానము చేయఁబడినది. బాహుసుబాహు దీర్ఘబాహుల భావపరిణామములచే నిర్ణీతమైనది.

ఎనిమిదవకథ పరోపకారపద్ధతిని దెలుపుచు లోభులపద్ధతి విమర్శింపబడిన్నది. సుధర్ముఁడను జింకలరాజు నుపకారబుద్ధి ప్రశంసాపాత్రము. ఈకథకుఁ బరోపకారమను శీర్షికకంటె రాజధర్మమను శీర్షిక తగియున్నది: (కొన్ని కారణములచే మార్పబడలేదు. గ్రంథకర్త)

ఆత్మస్తుతి కుబ్బితబ్బిబ్బగువారి రీతులు తొమ్మిదవకథలో వివరముగాఁ దెలియనగు. ఇందలి పరాంకుశుని కథనుబట్టి యోజింపగా దీనికాత్మస్తుతి కూడదనుటకంటె ముఖస్తుతికూడదను శీర్షిక యొప్పిదమగు. (మార్పబడినది. గ్రంథకర్త)

పదవకథయందు తనకుఁ దెలియదు. ఒకరుచెప్పిన వినఁడు—అనుమూర్ఖుని దురవస్థయు, ఓపికమెయి విమర్శించి చేయువాని ప్రయోజకత్వమును జయపాలవిజయపాలుర కథలవలన స్పష్టమగుచున్నది.

ఈ పదికతలును బదివిధములగు శీర్షికలతోఁ బలువిషయములఁ జర్చించుటయే గాక పదిపట్టణములఁ బదిపర్వతములఁ బదినదుల వివరించి బాలికలకు భూగోళశాస్త్రమందును దేశచరిత్రమందును గొంత పరిచయము గలిగించుచున్నది. భాష యన్నివిధముల నిర్దుష్టమని నేఁజెప్ప సాహసింపను.

కాని, భావములు, నీతులు, కథలు బాలురకు నూతనప్రబోధ మొనరించు చున్నవని నొక్కి చెప్పవచ్చును. బాలకులుత్సాహవంతులై, దీనిం జదువఁ గలరని నా నమ్మిక. చదివినవారిలోఁ గొందరైన సదాచరణసంపన్నులై రేని గ్రంథకర్త పడినపాటు సఫలంబు కాఁగలను.

చిత్తూరు
ప్రజోత్పత్తి పుష్యశుద్ధ
పంచమి
1[illegible]-1—1932

ఇట్లు
విద్వద్విధేయుఁడు
పూతలపట్టు శ్రీరాములురెడ్డి.

# మూడు మాటలు



గ్రంథరచనయందు నా కిది ప్రథమప్రయత్నమగుట నిందు దోషము లుండక పోవని నా మనస్సునకుఁ దట్టినను, నేనుఁ ద్రొక్కియుండు నూతన మార్గమునకైనను నన్నాంధ్రలోకము ప్రోత్సహింపక పోదని నమ్ముచున్నాఁడను.

ఈ చిన్ని పొత్తమును వ్రాయుటయందు నా యుద్దేశ మొకటి. బాలు రుపఠించుట కుత్సాహకరమగు మాటలుండెనేని వారికిఁ జదువ మిగులఁ గుతూహలమగు చుండును గావున ప్రతికథకు ముందును నా కథయందలి నీతిని జదువ వినను త్సాహపూరితముగ నుండులాగున రచించితిని. ప్రతికథయందును మనదేశపు భూగోళవిషయములను, చరిత్రాత్మకమగు విషయముల నందందుఁ జొప్పించితిని. ఇందువలన బాలురకు నీతియు, కథయు గాక దేశమును గుఱించికూడఁ దెలిసికొనుటకు వీలయ్యెడి. ఒక్కొక్క కథయు వ్రాసిన తర్వాత నీ నూతనవిధానము బాలుర కెంతవఱకుపకరించునో తెలిసికొనుటకై మా హైస్కూలులోని బాలురకు బోధించితి. వారు వినుటయందును మరలఁ జదువుటయందును గనఁబఱచిన యుబలాటమే నన్నీ కథల బయలుపఱచుటకుఁ బ్రోత్సహించినది.

ఈ పుస్తకమును వ్రాయుటయందు నాకుఁ దోడ్పడిన బహుగ్రంథకర్తలును పండితులును నగు మ. రా.రా. శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారికిని మ. రా. రా. శ్రీ తూళ్ళా నాగేశ్వరయ్యపండితులు గారికిని వందనము లర్పించుటకు మఱచిన నా విజ్ఞప్తి సంపూర్ణము కాఁజాలదు.

మఱియొకమాట ఈ గ్రంథముద్రణ విషయమున నాకు సాయమొన ర్పఁబూని నన్నెంతేని బ్రోత్సహించి కార్యనిర్వాహణకుం గడంగిన శ్రీ శ్రీ శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారికి హృదయపూర్వకవందన సహస్రములఁ జేయుచు నట్టి యాగర్భ శ్రీమంతు లస్మదాముల ప్రార్థనల నాకర్ణించి వలసిన సాహాయ్యమొనర్చి నందులకుఁ గరుణానిధియుఁ గౌసల్యాగర్భ శుక్తిముక్తామణియునగు రఘురాముఁడు వారికిని వారికుటుంబమునకు నష్టైశ్వర్యసంపదల నిచ్చి రక్షించుగాక.

చిత్తూరు
బోర్డుహైస్కూలు



ఇట్లు
పగడాల కృష్ణమూర్తినాయఁడు
రచయిత

ఈ చిన్ని పుస్తకమును బీదలకష్టనష్టములఁ దనవిగ భావించి వారికిఁ

దోడ్పడుటకై రేయియనక పగలనక కష్టపడి సాహాయ్యము

చేయుచు, శ్రీమంతులయ్యుఁ బేదలలో నొక్కరుగఁ

గలసిమెలసి తిరుగునట్టి సహజసౌజన్య హృద

యులును ఉదారగుణులునునగు మ.రా.

రా. శ్రీ పొలకల రామచంద్రా

రెడ్డిగారి యాదరణ

పాత్రము

గావించి

తిని.

# నీతిప్రబోధిక

---

## భక్తి

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందంబడి మగుడ మీఁది ♦ కిన్నెగయు సుమీ
మందుఁడు మృత్పిండమువలె
గ్రిందంబడి యడఁగియుండుఁ ♦ గృపణత్వమునన్.

శ్రీయుతులకు ధనమెట్టులు మెఱుగు దెచ్చుచున్నదో అట్లే భక్తి భక్తులకు శుభము చేకూర్చుచున్నది కాని జనులందరు నీ భక్తిమహాత్మ్యము దెలిసికొనుటలేదు. మఱికిగుంటలోని మండూకమునకు నదియే ముల్లోకమన్నట్లు మూఢ మనుజునకుఁ బ్రపంచమనియు, దైవమున్నాఁడనియుఁ, దెలియుట సున్న. భక్తి లేకున్న ముక్తి రానేరదని ప్రాజ్ఞులనుచుండ, భక్తి బువ్వాలకు లోపమని యజ్ఞులందురు. ఇందేది నిక్కువమో గ్రహింపవలయును. భక్తి లేకున్న మానవుఁడు కడతేఱ నేరఁడు. ఆవగింజంత ప్రీతి దైవమందు, తన్ను సృష్టించి సౌఖ్యము లొసగుచుండెడి యా సర్వేశ్వరుని యందు, లేకుండెడి హృదయము నీచగుణములకు పుట్టినిల్లని మెఱుఁగవలయు. రాజులు తా మనుభవించుటకు రాజ్య మెట్లు స్థాపించిరో అట్లే మహాత్ములు కొంతమంది సర్వజన మంగళము కొఱకు భక్తిసామ్రాజ్యము నెలకొల్పిరి. రాజ్య

ములు సంపాదించుట యెంత కష్టముగ నగపడునో భక్తి సామ్రాజ్యము స్థాపించుట యంతసులభముగ నున్నట్లగపడును.

భక్తియన తన హృదయమున భగవంతు నారాధించుచు నా జగజ్జనకునికి మంచి బిడ్డఁడని యనిపించుకొనుటకు ప్రయత్నించుటయే! అట్లు హృదయమును భగవదర్పితము గావించిన వారిసంఖ్య మిగులఁ గొలఁది. ప్రాణములు సహితము గోలుపోవుటకు వెనుదీయక ఆడంబర జీవితమున కాసించువారు పెక్కండ్రు కాని సులభసాధ్యమగు నహింసాజీవితమును గోరువా రరుదు.

పూర్వము నుండియు మన దేశము భక్తి భిక్ష మితర దేశముల కిడుచుండినది. భక్తికొఱకు బిడ్డలను సమర్పించిన వారు, శేషశాయి సేవకొఱకై శరీరమును లెక్కపెట్టక కష్టములు పడిన వారు, తనువు లశాశ్వతములని తమ సర్వస్వము బీదసాదుల కర్పించినవారు, ప్రాణముల నొకరి పాపముల క్షమించుటకొఱ కిడినవారు పుట్టిన యీ దేశమున దైవభక్తి క్రమముగా సన్నగిల్లుచున్నది. బూడిద బూసికొనినవాఁడు భాగవతోత్తముఁడు. పంగనామముల వెంగళప్ప పరమపావన మూర్తి. రుద్రాక్షల భద్రయ్య ముక్కంటికి మొదటిశిష్యుఁడు. జడలు పెంచినవాఁడు జహ్నుమహామహుఁడు. బకధ్యాన మొనరించినవాఁడు బ్రహ్మయ్యగారు—అయిపోయినది—భక్తి ప్రాముఖ్యము తప్పిపోయినది. భక్తివేషము లోనికి నాటకము లోని బూటకపునటన లోనికి దిగిపోయినది.

ఉదయ మారుగంటలు మొదలు రాత్రి నిదురపోవువఱకు సంసార వ్యవహారమే గాని దేవదేవుని జింతించుట లేకపోయె. తన్నుఁ బుట్టించి పెంచి, సర్వసుఖముల నిచ్చి కాపాడుచున్న యా కృపాళు, నా లోకైకనాథు నొక్కనిముసమైన స్మరింపఁ బనిలేదా? నారాయణుని విగ్రహముముందుఁ గూర్చుండి కర్పూరహారతు లిచ్చునపుడు గంట గణగణ వాయించుచు, ఓం, కృష్ణాయనమః, ఏమే, బిడ్డ యేడ్చుచున్నాఁడు కాసంత పాలీయరాదా? ఓం, మాధవాయనమః, ఏమే! నీబుద్ధి బుగ్గి గాను. వీధిలో నరచు భిక్షుకుని పొమ్మని చెప్పలేవా? ఓం, కేశవాయనమః, తిరుగబోత మాడిపోవును సుమా కొంచె మెక్కువ యుల్లిగడ్డలు పడనిమ్ము. అను నిత్యాది సంసార జపమంత్రమును బఠింపఁగలరు కాని నిశ్చలభక్తితో నొక్క నిమిషమైన దైవమును తలఁపఁజాలకున్నారు.

ఇటులే కొందఱు భక్తు లర్థముగాని వాక్యములఁ జిలుకల వలె తమకు వచ్చిన మాటలనెల్ల వదరుదురు. ఆమాటల సారాంశము నెంత తర్కించినను మనకు దొరకునది యుల్లి పొట్టంతయైన నుండదు. తుదకు వారికి కాదు వారిని బుట్టించిన వారికిఁ గూడ, దెలియదు. అట్టివారు కూడ పరమ భాగవతులనియే చెప్పఁబడుచున్నారు.

రాజ్యములు నశింపవచ్చు, కలిమి లోపింపవచ్చు, సౌందర్యము చెడవచ్చుఁ గాని భక్తి మాత్రము నశించునది గాదు. ఇందుల కొక నిదర్శనము గలదు.

ఇప్పుడు పంజా బనబడు దేశము పూర్వము పాంచాలమని పిలువఁబడుచుండెడిది. అచ్చట జీలము, చీనాబు, రావి, బియాస్, సట్లెజ్ అను నయిదు నదులు ప్రవహించుటచే పాంచి ఆబ్ అని పేరై రాను రాను పంజాబు అని మాఱినది. ఈ దేశమున, గురునానకు ననంతరము సిక్కులని యొక తెగవా రేర్పడిరి. వారందఱు నా గురునానకు మతావలంబులు. సిక్కులు మునుముందు దైవభక్తి యుతులుగను, సాధుస్వభావము గలిగినవారుగను నుండిరి కాని మహమ్మదీయులు తమ మతము వ్యాపింపఁజేయుటకు వారిని బంధించుటకు ప్రయత్నించినపుడు వారు తమ సాధుస్వభావమును విడిచి స్వసంరక్షణార్థమై యుద్ధవీరులు గావలసివచ్చెను. పాపము వారప్పుడప్పుడు హిందూదేశముపై దండెత్తి వచ్చు నితరదేశస్థులవలన నెక్కువబాధ పడవలసి వచ్చుచుండెను. ఆపదలనిన వారనుదిన జీవిత కార్యక్రమములలో నొక్కటిగ భావించుచుండిరి. అందువలన నా దేశస్థులకు గష్టములనిన నొక లెక్కలోనిదికాదు. వారికిఁ గష్టములు రానురాను, వారి మనస్సు దృఢమగు చుండెడిది.

పంజాబుదేశమున మారీభవనమను నొక్క పల్లెటూరు గలదు. ఆ గ్రామములోని వృద్ధులు, లోభులు, యౌవనులు, క్రూరులు. స్త్రీలన్ననో కాకికి మెతుకు విదల్చువారు కారు. ఇఁక బాలురమాట చెప్పవలయునా! వారిని సంరక్షించు పెద్దలే యట్లున్నప్పుడు వారెట్లుండిరో మీరే యోచింపుఁడు.

దయయననదెట్టిదో వారి హృదయమున నెంత వెదకి నను గనుపట్టదు. విభూతి పూయని వృద్ధులు పంగనామములు పెట్టని పురుషులు, రుద్రాక్షులు ధరింపని పెద్దలు కపటనటనలు చూపని కన్నియలు, ఉళక్కిమాటలు పల్కని యువతులు, బూతులుతిట్టని బాలురు, ఆ పురమున గానరారు. ఎవరేనొక భాగ్యవంతుడా పల్లియం జొచ్చిన, వానిని గీర్తించి, తాము భక్తులుగ నటించి, ఔరా! యింతటి సన్మార్గు లున్నారా యనిపించి వానిధనమెల్ల లాగి వాఁడు బడుగయినంతనే వానికి నొక్క పూటయిన గ్రుక్కెడు గంజి బోయక తఱిమివేయుటే వారిపని. భిక్షుకుల కాయూరన్ననో మిక్కిలి భయము. త్రోవ తప్పి యెవ్వడేనొక జోగి యా యూరుచేరునా! యంతటితో వానిపనిసరి. రాలుఱువ్వుటో, బూతులు దిట్టుటో, పోపొమ్మని దుడ్డుకఱ్ఱలతో బెదిరించుటో, వారిపని. కరుణలేని యా పుర వాసులిట్లు తమ జీవితములు గడపుచుండిరి. అన్నియు పైవేష ములు, పైమాటలు, పైనటనలు గాని నిశ్చయముగ దైవ మున్న నేమి, ఆతని నెల్ల భజించవలయును? బీదసాదుల నెట్లు దయఁజూడ వలయును అనుటయే లేదు. మాది, యను మాటయే గాని మనది యనుమాట వినరాదు.

ఆ పురమున కరక్రోసు దూరమున నొక గృహము గలదు. అందు సుధర్ముడను నొక సాధుపుంగవుఁడు వసించు చుండెను. అతనికి సుమతి యను భార్య గలదు. ఆమెయు భర్త కను సన్నల మెలఁగి యాతనికి సంతస మొడఁగూర్చు చుండెను.

భిక్షుకులపాలిటి మారీపురమగు మారీభవన గ్రామము నుండి తఱుమఁబడిన ప్రతిభిక్షుకుఁడును వారింటికివచ్చి యాతిథ్యము బొందుచుండిరి. సుధర్ముఁడు సర్వేశ్వరునియందు భక్తి, పాపభీతిగలవాఁడు. తనకున్నదానితో సంతృప్తిఁజెంది జీవయాత్ర నొకవిధముగఁ గడపుచుండెను. ఒకయావు, ఒక చిన్న అరఁటి తోఁటవానికిఁ గలయాస్తి. తోఁటలోని కాయల నాకులనమ్మి యతఁడు జీవించుచుండె. కట్టుకొనుటకుఁగూడ వస్త్రములు కఱవుగ నుండెను. ఎన్నికష్టములు పడుచుండినను భగవంతునియెడ భక్తి, బీదలయెడ దయమాత్రము విడిచినవాఁడుకాఁడు. పాపమొక్కొక్క పరి యున్నయాహారము భిక్షుకులకిడి గిన్నఁడు నీటితో శయనించు స్థితి యాదంపతులకుఁ దప్పినదికాదు. సుమతి మిగుల దయాశీల యగుటచేఁ దానొక ప్రాణికిఁ గడుపునిండ నన్నము పెట్టలేని స్థితి గలిగినందులకు పరితపించు చుండెడిది.

ఇట్లుండ నొకనాఁ డిద్దఱు తిరిపెగాండ్రు మిగుల నాయాసముతో మారీభవనమువంకఁ బోవుచుండిరి. వారిలో నొకఁడు కడువృద్ధుడనుటకు నూతని ముఖములోని ముడుతలే సాక్షిగనుండెను. మఱియొకఁడు ముప్పదేండ్లకు తగ్గనివాఁడు. వారు ధరించిన యుడుపులన్నియు బెక్కు చీలికలై యుండెను. ముఖములెన్నియో దినములనుండి యాహారము లేక కృశించినట్లుండెను. వారిరువురా పురముఁజొచ్చి పట్టెఁ డన్నము కొఱకు పల్లెయంతయుఁ దిరిగిరిగాని పిడికెఁడన్నము

గూడ దొరకలేదు. ముసలివారా బిచ్చగాండ్రపైఁ జిడిముడి పడిరి. స్త్రీలు "మీకు వండిపెట్టుట కన్న వేఱుపనిలేదా" అని సాగఁదీసి చెప్పిరి, ఈ దిమ్మరులకు నింకేమియుఁ బని లేదా యని కొందఱు కూఁతలు పెట్టిరి. బాలురు ఱాలుఱువ్వ మొదలిడిరి. కుక్కలు లొళ్లు లొళ్లు మని మొఱుగఁజొచ్చెను. ఆ పురమున నుండుటకు భిక్షుకులకు దుస్సహమయ్యెను. వారా ఱాలదెబ్బలకు, కుక్కల యార్భాటములకుఁ, దప్పించుకొని యూరిబైటఁ బడుసరికి మరల మాతృగర్భమునఁ బుట్టినట్లయ్యె.

అప్పటికి సాయంకాల మాఱుగంటలగుడుఁ జలిచే వణఁకుచు దూరమున నున్న సుధర్మునింటికి మెల్లగాఁ బోయిరి. అప్పటి కప్పుడే సుమతియు నామె భర్తయు భోజనమునకుఁ గూర్చొనుచుండిరి. ఆ సమయమున తలుపు నెవ్వరో దట్టిన చప్పుడు వినిపించుటచే సుమతి కవాటమును దెఱచి యిరువురు క్షుధాతురులు చలికి వణఁకుచు నిలువఁబడి యుండుటఁజూచి; "అయ్యలారా! లోనికి దయచేయుఁడు. ఎందుండి దయచేసితిరి. తాము మారీభవన గ్రామమునకుఁ బోలేదుగదా!" అనియె. అందులకా వృద్ధు, తల్లీ! మే మచ్చటినుండియే వచ్చుచుంటిమి; ఆ యూరెంత నిర్భాగ్యపుఁ గొంప! ఒక్కరైన నొక మెతుకుపెట్టలేదు. కడకొక చిప్పెఁడు గంజైన నను బోయువారికి చేతులాడలేదు. అబ్బా! ఎంతకఠినులు! మీరైనను మా కేదేని తినుటకుఁ గొంచము పెట్టినసరి లేకున్న, మా ప్రాణము లాఁకలి బాధకు నిలువవని చెప్పెను. ఆమె వారిని

లోనికిఁ గొనిపోయి యా పూటకుఁ దాము తినుటకుఁ బెట్టు కొని యుంచుకొనిలోఁ గొంచెము వారికిఁ బెట్టి, యున్న పాల లో సగమిచ్చెను.

వారా పదార్థము లన్నియు సుధర్ముఁడు పూజించు చుండు విధానములు నడుమ నడుమ నడిగి తెలిసికొనుచుఁ దినుచుండిరి. వారికి వడ్డించిన యాహారవస్తువులయి పోయిన తర్వాత మరలఁ గొంతవడ్డింపు మని చెప్పిరి. సుమతియుఁ దమకు మిగుల్చుకొనిన యాహారమునంతయుఁ బెట్టి చెంబులోనున్న పాలనంతయు నొసఁగెను. భిక్షుకులును దానిని మెసవి యిం కను గొంచెమాహారమును పాలను పెట్టుమని ప్రార్థించిరి. సుధఁ ర్ముఁడింక నేమైన మిగిలియున్న దానితో వారి యాఁకలి దీర్చు మను నర్థమిచ్చునటుల భార్యవంకఁ జూచెను. సుమతి, "అయ్యలారా! మా దౌర్భాగ్యమును క్షమింపుఁడు. ఉన్నది తమకు దాఁచక పెట్టితిమి. మీ యాఁకలినైనను పూర్తిగఁ దీర్చలేనందులకై చింతించుచుంటిమని మిగుల దైన్యముతో ననెను. అందులకు వారిలో నొకఁడు, "ఏ మమ్మా! ఎంతనంగ నాచివి! పెట్టుకొని లేదనుచున్నావే! అతిథులకన్న నీ కడు పంత గొప్పదా!" అని గద్దించెను. అందులా కాసాధ్వీమతల్లి! అయ్యా! నే నిప్పుడే ఉన్నదంతయు మీకుఁ బెట్టితిని. మీకు వంచనచేయుదునా? అనుటయు నా ముదుసలి "పోయి చూడ వమ్మా కొంచెమైన నుండకపోద"ని బదులిడెను. సుధర్మపత్ని! ఆ వృద్ధునిఁజూచి "నే నెంత జెప్పినను తమకు విశదము కా

దయ్యె. ఇంటివాఁడు గొడ్డుగేదెయన, పైవాఁడు పాఁడిగేదె యున్నట్లు పదార్థములున్న సంగతి నాకుఁ దెలియక మీ కెట్లు దెలియును" అనుచు గృహములోనున్న పాత్రలఁజూచి యా శ్చర్యపడి నాథా! యని కేకవైచెను. సుధర్ముఁడేమి యాపద సంభవించెనో యని భార్యనుఁజూడఁ బరుగిడెను. సుమతిభర్త కచ్చటనున్న పాత్రలన్నిటిని జూపి "వట్టిపాత్రలలో మరల నెప్పటియట్లు పదార్థములును, పాలునున్నవి. ఇయ్యదికలయా! భగవన్మాయయా! మన ఇంటికివచ్చియుండు నతిథులు సాధా రణమానవులుగారు. వారు దేవతలై యుండనోపుదు"రని యానందమున నా పాత్రల నెత్తుకొని వారియొద్దకుఁ జని వారి పాదములపైఁ బ్రాలి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, తాము తెలియకచేసిన తప్పుల మన్నింపుఁడని వేఁడిరి.

ఆ భిక్షువులును మందస్మితవదనారవిందులై తమ కల రూపెఱింగించి యిట్లనిరి. "ఓ! సాధుదంపతులారా! మీ భక్తిం బరీక్షింప నిచ్చటికి వచ్చితిమి. మేము మీ యౌదా ర్యాదిగుణములకుఁ బ్రసన్నులమైతిమి. మేము వరుణవాయువు దేవులము. మీరిఁక నాహారమునకై కష్టపడనక్కఱలేదు. మీ ధర్మము మిమ్ము రక్షించు. ఆ పాత్రలయందు మీ కాహార మెప్పటికిని దఱుగకయుండగలదు. మీరు కొంతకాల మీలోకమున నివసించి తదుపరి దేవునిఁ జేరెదరుగాక" అని దీవించి! "మారీభవనము రేపుదయమున నాలుగంటల లోపుగ జలమయమగుఁగాక! కఠినాత్ములు వారికిఁదగు శిక్ష

ననుభవింపవలయు ». నని చెప్పి అంతర్ధానమందిరి.

వాయువరుణదేవుల యాశీర్వాదమునకు సుమతీసుధర్ములు మిక్కిలి సంతసపడిరి, ఆరాత్రి వారికి భోరుమను గొప్పశబ్దము వినఁబడెను. ఉదయ మాఱుగంటలకు ఆ దంపతులు మారీ



ఆ దంపతులు మారీభవనమువంకఁ జూడ నచ్చట నొక పెద్ద తటాక మేర్పడి యుండెను.

భవనమువంకఁ జూడ నచ్చట నొక పెద్ద తటాక మేర్పడి యుండెను. గ్రామవాసుల దుర్మరణమునకు వారు మిగులఁ జింతించిరి.



# అసూయ

మ॥ తమకార్యంబుఁ బరిత్యజించియుఁ, బరా ♦ ర్థ ప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచున్ బరహితా ♦ ర్థ వ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుక జనుల్ ♦ దైత్యుల్ వృథాన్యార్థ ఘం
గము గావించెడు వారలెవ్వరో యెఱుం ♦ గన్ శక్యమే యేరికిన్॥

"గుఱ్ఱము గుగ్గిళ్ళు దినుచుండ గాడిదకుఁ గడుపుబ్బె" నన్నట్లు లోకమున నెచ్చటఁ జూచిన నోర్వలేనితనము నిండి యున్నది. నూటికిఁ గోటికొక్కఁడు దప్ప నసూయపడని వారిని మనము చూడఁజాలము. ఓర్వలేని తనమనునది ప్రతి మనుజుని బిశాచివలెఁబట్టి పీడించుచున్నది. ఈ పిశాచము మంత్ర తంత్రములచే వేఁప బెత్తములచే—ఓం, హ్రీమ్మను ఘోషచేఁ బారిపోవునదిగాదు. మానవుఁడు తాను బెంపొందుటే ప్రధానముగ నెప్పుడు తలఁచుట లేదో యప్పుడే యాతని హృదయమునుండి యీ యసూయా గ్రహము వెడలిపోవును. భగవంతుని సృష్టియందు బ్రాణులు పరస్పరము సాహాయ్య పడవలయుననుట యతని యిచ్ఛ యను రహస్యమెఱిఁగిన మనస్సు యోర్వలేని తనమునకు బ్రహ్మాస్త్రమగుచున్నది. అసూయ పెక్కు మనుజులఁగాదు గదా యనేక కుటుంబముల, గూడ నాశనము చేసినది. అసూయయే భర్తకు భార్యపై భార్యకు భర్తపై నీసు గలిగించినది. బిడ్డకుఁ

దండ్రిపైఁ దండ్రికి బిడ్డపై బడబానలము గలిగించినది. అన్నకు దమ్మునిపై దమ్మునికి నన్నపై నసడ్డ గలిగించినది. ఇరుగు పొరుగువారికి మత్సరము మన నిచ్చినది. కావునఁ బ్రతి మానవుఁడును నీయసూయను దరికి రానీయకుండ జాగ్రత్తగ నుండవలయు.

కారణము లేనిదని కారణము గలదియని యసూయ రెండు విధములు. కారణము లేని యసూయ తనకు లాభము గలుగకున్నను మఱియొకరి యౌన్నత్యముఁ జూచి యోర్వదు. కారణముగలది తన కేదైనఁ గలుగు కూడుదల మఱియొకనికిఁ బోయినదని యుడుకును. సహేతుకమైనను నిర్హేతుకమైనను నొకరి కలిమిపై గంటగింపు. సౌందర్యముపై సూడు, మంచిపై మత్సరము, గుణములపై గోదగోద, వృద్ధిపై విఱిపోటు, ఒమ్మికపై నోల్లమి, గలిగియుండుటకన్న వేరుపాపము లేదు.

పొరుగింటివాఁడు పెంకులనింటికిఁగప్పిన నప్పుడువానిపైఁ బ్రల్లదము లెందులకు? అతఁ డేమైన నీకొంపపైనున్న పెంకులు పెఱికి వానిగృహముపైఁ గప్పుకొనెనా? ఒకరి సౌందర్యముంగూర్చి యోర్వలేక వానిని బాగుగనున్నాఁడనుటకు బదులుగ నెట్టుతోలు వెట్టిగొల్లఁడని వెక్కిరింతువే! అతడు నీ సౌందర్యమేమైనను నెరవు దీసికొనెనా? ఒకని సుఖముఁ జూచి ససేమిరా చూడఁజాలవే. అతఁడు నిన్నా సుఖమును బడ యవలదని చెప్పెనా? . ఎందులకీ యుబ్బసము? ఎందులకీ చూపోపమి? ఎందులకీ యాందోళనము? తండ్రి సంపాదిం

చిన మొక్కఁబోకిఁ బంచుకొనుటకు బొబ్బరింపులా ? లింగఁ డిచ్చిన గిద్దెఁడు లొత్తగింజలకు లాటీదెబ్బలా ! పసులకాఁపరి పాఁతపేలికకు నన్ని పల్లటీలా ? ఇట్టి యసూయయే మానవుల హృదయమున లేకుండినచో నిన్ని కచ్చేరీ లెందులకు ? ఇన్ని యొజ్జికుళ్లాయి లెందులకు ? ఇన్ని చెఱసాల లెందులకు ? ఇన్ని తెగనీల్లు లెందులకు ? ఇన్ని బీదసంసారము లెందులకు ? ఇన్ని పొడుగుచొక్కా (Pleaders) లెందులకు ? దుర్యోధనుని వంశముతో సహా నశింపజేసినది ఈర్ష్య. శిశుపాలుని యమపురికంపినది మత్సరము. వాలిసుగ్రీవుల సోదరభావమును భిన్నముచేసినది యీాసు. ఇట్లెన్నియో గొప్ప కుటుంబములీ పిశాచముచే నాశనమయిపోయినవి. కావున మనము దీనిదరిఁ జేర్చకుండుట యుక్తము.

ఓర్వలేని తనమునుగూర్చి నెన్నియో యుపన్యాసములు వినుచున్నారము. ఎన్నియో వ్యాసములు చదువుచున్నారము. కాని వినునంతవరకైన, జదువు నంతవరకైన, నట్టి యసూయ హృదయమునుండి వెడలఁగొట్టఁ జాలకున్నారము. పూర్తిగా నీ యోర్వలేని తనమును మనలోనుండి దరుమఁ గొట్టుటకు బ్రయత్నింపవలయు. ఈర్ష్యఁబోగొట్టు గొనుటకు సదుపాయము లేక పోలేదు. నిష్పక్షపాత బుద్ధితో మెలంగుచుండిన నోర్వలేని తనము మరల దరికి రానేరదు. ఈసువలనఁ జాల సంకటములు సంప్రాప్తమగు ననుటకు నొక నిదర్శనము వినుఁడు.

హిందూదేశమున కుత్తరమున టిబేటను దేశము గలదు. ఆ దేశమంతయు పర్వతములచే నిండియుండును. దానికిఁ త్రివిష్టప మని మఱియొక పేరు గలదు. అచ్చట నివసించువారు బౌద్ధమతస్థులు. వారి గురువులకు లామాలని పేరు. వారియెడ టిబేటు ప్రజలకెక్కుడు గౌరవము గలదు. రాజ్యాధికారులకుఁ గూడ వారనిన మిక్కిలి గౌరవము. ఆ రాజ్యమున, సింధు, గంగ, బ్రహ్మపుత్రానదులు మానససరోవరముచెంతఁ బుట్టుచున్నవి. టిబేటునకు ముఖ్యపట్టణము లాసా. ఆ పట్టణమునకుఁగాని, యచ్చటినుండి మఱి యే పురమునకుగాని పోవలయునని నడచిగాని, యాక్కను జంతువుపైనిగాని పోవలయును. దేశము దుర్గమయమగుటచే రైలుమార్గము మచ్చునకైనను గానరాదు.

లాసా పట్టణమున కుత్తరమున టెంగ్రినారను సుందరమగు సరోవరము గలదు. ఆ చెఱువుగట్టున శాంతయ్య, అనంతమ్మ యను నిద్దఱు రెండిండ్లలో నివసించుచుండిరి. శాంతయ్య వయస్సు సుమారిఱువదివత్సరములు. అనంతమ్మ వయస్సు శాంతయ్యకన్న రెండుసంవత్సరము లెక్కుడుగ నుండెను.

శాంతయ్య పేరునకుఁ దగినట్లు శాంతమూర్తి; నిష్కల్మష హృదయుఁడు; ప్రేమస్వరూపుఁడు; చుఱుకుఁదనముగలవాఁడు; ఓర్పుగల మానిసి; మృదువుగ మాటలాడు స్వభావముగలవాఁడు; ఇన్ని మాటలేల? ఇన్ని విశేషణములేల? ఒకటే మాట. అతనియెడఁ దప్పులు పట్టువారు లేరన్న నతిశయోక్తి

గాఁ నేరదు.

అనంతమ్మ స్వభావము వేఱు; ఆమె రీతి వేఱు; ఆమె ఫక్కి వేఱు; ఆమె నైజగుణము వేఱు; ఆమె యునికి వేఱు; ఆమె కోర్పులేదు; నమ్మికలేదు; మృదుత్వములేదు; చుఱుకుదనము లేదు; దయలేదు; దాక్షిణ్యములేదు; కాని, కోపముకోటినంత. అసూయ కావలసినంత. చూపోపమిచాలినంత. గర్వముకొఱత లేనంత. యామెకుఁ గలదన్నఁ దప్పులేదు.

శాంతయ్య యుదయమున నాలుగంటలకే మేల్కాంచి నిద్రించు మానవులకు సూర్యునిరాక నెఱుకపఱచుటకు మేలుకొలుపులు పాడుచున్న పక్షిసముదాయంబులకుఁ గొన్ని గింజలుఁ జల్లిన తరువాతఁ దాను మక్కువగఁ బ్రేమించు కోకిల తన భుజముపై వ్రాల; దాని మేను దువ్వి దానికిఁ గావలసినంత యాహారమిడి యది యెగిరిపోయినపిదప నతని గృహకృత్యముల నిర్వర్తించుచుండెడివాఁడు. స్వేచ్ఛగ నరణ్యములఁ దిరుగు కోయిల శాంతయ్య భుజముపై నిర్భయముగఁ గూర్చుండు ననినంత, నతఁ డెట్టి సాధుస్వభావుఁడో మీరే గ్రహింపుఁడు. పక్షులుసహితము తన దయాళుత్వము గుర్తెఱుగునటుల నడచుకొనిన యాత డెంతటి ప్రేమస్వరూపుఁడో వేఱుగ వ్రాయవలయునా ?

అనంతమ్మ చాల సోమరి. ఆమె యెనిమిదిగంటలప్రొద్దెక్కినఁగాని పడకవిడువ నిష్టపడదు. అప్పటికిని నామె చిడిముడిపడుచునే యుండును. ప్రక్కయింటి శాంతయ్యను లేని

పోని నిందలఁబెట్టి తిట్లు గ్రుమ్మరించుచుండెడిదిగాని యతడు వానినెల్ల చెవిలోనికి జొరనీయక యామెను సుగుణవంతురాలినిగఁ జేయుమని దేవుని ప్రార్థించుచుండెడివాఁడు. అనంతమ్మ యనిన నాత్రోవను బోవు బాటసారులకు భయము. జంతువులకు జంకు; గువ్వలకుగిలి; బాలురకు బెదరు; వృద్ధుల కులుకు; ఆఁడువారి కడలు, ఇట్లామెకు వెఱవనివారులేరు. ఆమె మంటలుపెట్టి వంటలుచేయుతరుణమునఁగూడఁ గుండపైననో పొరకపైననో, చేటమీఁదనో కోపముచేసికొనుచు వదరుచుండుటగలదు. ఆమె స్వభావమట్టిది.

ఒకనాఁడు వాఁడుకమేరకుఁ గోయిల యుదయముననే శాంతయ్య యింటికడ నిలిచి యతనికిఁ దన రాక దెలియఁ ఒఱచుటకుఁ గాఁబోలు శ్రవణానందముగఁ బాడుచుండెను. ప్రతి దినము పరితమట్టు పాడుచురడుటచే సనంతమ్మకు నిద్రాభంగముగుచుండెడిది. కావున నామె నాఁటి దినమున మిగులఁ కోపముతోఁ బడకనుండిలేచి శాంతయ్యను సమీపించి “శాంతయ్యా! నీ పోరునకు నేనిల్లు విడిచిపోవునట్లున్నదే” నిత్యమును నీకెంపుకంటికూఁతలచే నా నిదుర చెడుపుచున్నది. ఇకమీఁదు దాని నీయింటికి రానీయక తఱుమఁగొట్టితివాసరి. లేకున్న మన కిరువురకు గలహము జరుగకమానదని చెప్పి



“శాంతయ్యా నీ పోరునకు నే నిల్లు విడచిపోవునట్లున్నది.
నిత్యమును యీ కెంపుకంటి కూఁతలచే నా నిద్ర చెడుచున్నది ”

వదరుచు నింటిలోనికిఁ బోయెను. శాంతచిత్తుఁడగు శాంతయ్య యామె మాట లంతగాఁ బాటింపఁడయ్యెను.

ఎప్పటియట్లా సాకుఁడుఫులుఁగు మాత్రము ప్రాతఃకాలము ననే దయాళువగు శాంతయ్యను దన కూఁతలచే నాహ్వానించుచు నుండెను. ఒకనా డనంతమ్మ యయిదు గంటలకు మునుపే మేల్కాంచి మైకఫుమందులో నానవేసిన కొన్ని గింజలను నొక కత్తెరను జేతఁ బట్టుకొని శాంతయ్య యింటి ముంగిట నా విత్తుల నచ్చటచ్చటఁ జల్లి యొక పొదలో దాఁగి యుండెను. శాంతయ్య యప్పటికింకను నిదురనుండి లేవలేదు. కోకిల యప్పుడే యా చెట్టుమీఁదనుండి యీ చెట్టుమీఁదికి నెగురుచు ననంతమ్మ యున్న పొద సమీపమునకు వచ్చి యచ్చట చల్లబడియుండిన గింజలను జూచి మిగుల సంతసమున భూమిపై వ్రాలి యొక్కటి రెండు గింజలను మ్రింగెను. పాపమా చిగురాకుదిండి వెంటనే మైకముచే నచ్చటనే గూలఁబడెను. అప్పు డనంతమ్మ పొదలోనుండి నవ్వుచు బైటకు వచ్చి మైకముతో నున్న పక్షిని బట్టుకొని యిక ప్రతి దినమును నీ సంగీతముచే నాకు నిద్రాభంగము చేయవులే యని తన చేతనున్న కత్తెరతో నా పెంపుడుకూన నాలుకను గటుక్కునఁ గత్తిరించివైచెను. ఆ కెంపుకనులపులుగు పరుగెత్తఁ జాలక యచ్చటనే మైకము దీఱునంతవఱకుఁ బడియుండెను.

ఆ దినము శాంతయ్య తన ప్రియమగు కోకిల పలుకని కారణము దెలియక యింటిచుట్టు వెదకుచుండెను. అతని యాతురతను జూచి యనంతమ్మ యచ్చటికి వచ్చి "శాంతయ్యగారూ! ఇకమీఁద నాకు నిద్రాభంగమును, దమకుఁ

గోకిల దర్శనమును దప్పినది. ఆ పక్షికొఱకై యేల వెదకె దవు? నేను దాని నాలుక నీ దినమునఁ గత్తిరించి వైచితిని." అని వికృతాట్టహాసము చేయుచుఁ బల్కెను.

శాంతయ్య యీ మాటవిని నదే బాలకునివలె నేడ్వ మొదలుపెట్టెను. "అనంతా! ఆ నోరులేని చిన్నపక్షి నాలు కను గత్తిరించుటకు నీ చేతులెట్లాడెను. దానికి బదులు నన్నే విసమిడి చంపియుండిన నీ బాధలన్నియు నసించియుండునే" అని వాపోయెను. మధ్యాహ్నమువర కతడట్టులే దుఃఖించి, యీ తలిరుదిండిని వెదకుచు నరణ్యమునుబట్టి పోయెను. అట్లు పోయిపోయి మిగుల నలతచే నొక గొప్ప వటవృక్షచ్ఛాయ విశ్రమించెను. అచటికిఁ దాను వెతుకుచుఁ బోయిన కోకిల వచ్చి మనుజ భాషణముల శాంతయ్యతో నిట్లులనియె. "అయ్యా! నీదయకు నే నెంతయో సంతసించితిని. నాకాహార మిచ్చి నన్నుఁ బోషించుచుండిన నీఋణము దీర్చుటకుఁ దగిన వెరవులేదు. నావెంట దయచేసి నేనిచ్చు నాతిథ్యముగై కొనుము. నేనొక దేవతను. నాకిష్టమువచ్చినపుడీ కోకిలరూపెత్తి ప్రపంచమున మానవుల హృదయము నెఱుంగుచుందును."

శాంతయ్య కోకిల పలుకుల కలరి, తుదకుఁ గోవెలను జూచితినిగదా యని మిగుల సంతసించి దానివెంటఁ బోయెను. వారిరువు రచ్చటనుండి గొంతదూరము బోయి ఒక కొండ గుహాలోనికి బోయిరి. అచ్చటికిఁబోయి నదే యాపక్షి యొక సుందరాకారుఁడుగ మాఱిపోయెను. ఆ గుహాయందు భోజన

సామగ్రు లప్పుడే యమర్చినట్టులుండెను. వారిరువురును సర్వే శ్వరుని గూర్చి ముచ్చటించుచు విందు గుడిచిరి. తదుపరి ఆ సుందరపురుషుఁడు శాంతయ్యతో " ఓ సాధుస్వభావుఁడా! అదుగో యామూల నొక చిన్నగంపయు, పెద్దగంపయు గలవు. వానిలో నేదైన నొకదాని నెత్తుకొని నీ గృహమునకు బొమ్ము" అనెను.

శాంతయ్య యా గంపలకడకుఁ జని పెద్దదిగ నుండు గంప మోయుట భారము గావున చిన్నగంపనే దీసికొనెదనని, యా చిన్నగంప నెత్తిపై నిడుకొని యతనితోఁ " బోయివచ్చెద" నని చెప్పెను. అందుల కాతఁడు "సరియే సుఖముగ నిల్లు చేరుము. ఇంటికిఁ బోవునంతవఱకు నీ గంపను దెఱవకు" మని హెచ్చరించి యతనిని సాగనంపెను.

శాంతయ్య సాయంకాలమున కిలుచేరి గంపలో నేము న్నదో చూడవలయునని దానిపైనున్న మూతను బైకెత్తెను. అందమూల్యములగు నాభరణము లగపడెను. శాంతయ్య సం తోషమునకు మేరయే లేదు. ఇక మీఁద నేలాటి గష్టము లేకయే తన జీవయాత్ర గడపవచ్చునుగదా యని యను కొనియెను.

అనంతమా నాఁటిరాత్రి శాంతయ్య యింటిలోనికి వచ్చి "ఏమయ్యా! ఈ దినమంతయు నెచ్చటికిఁ బోయియుం టివి? నీ కోకిల దొరకెనా?" అని కుచ్చితముగఁ బ్రశ్నిం చెను. శాంతయ్య అమాయకుఁడు గావునఁ దాను బయలు

దేఱుటయు, నొక చెట్టుక్రింద విశ్రమించుటయు, కోకిల కన బడుటయు, వాడారగించుటయు, నాభరణముల గంప దెచ్చు కొనుటయు మొదలగు విషయముల వివరముగఁజెప్పి తాను దెచ్చిన వెలగల నగల నామెకుఁ జూపెను.

అనంతమ్మ కప్పుడు కన్ను లెఱ్ఱఁబాఱెను. దేహములోని రక్త ముష్ణమెక్కెను. మనస్సు చలించెను. మూతి సొట్ట వోయెను. తానుఁగూడ నట్టి యాభరణముల సంపాదించు నంతవఱకు విశ్రాంతి బొందునట్లగపడుటలేదు. ప్రక్కయింటి శాంతయ్య కట్టి భాగ్యముకాక తాళీయముగ లభించినందులకై యామె లోలోన నేడ్చిన యేడ్పు లింతంతనరాదు. ఆమె యప్పుడు పెదవులతో మాత్రము శాంతయ్యతో మాట్లాడు చుండెను గాని హృదయము మాత్రము తొడవులపైని తలంపులచేఁ దత్తళించుచుండెను.

అనంతమ్మ యానాటిరాత్రి యింటమంచముపై బండు కొని యెట్టెటులో నిదురవోయెను. ఆ నిదురలో నామె కొక కల ఆ కలలో నామె కోకిల గుహకుఁ బోయినట్లును, కోకిల మాత్ర మామె కాభరణములగంప నీయకుండుటచే నామె యే పక్షికిఁ దెలియకుండ దొంగిలిదెచ్చికొని తన మంచముప్రక్కను బెట్టుకొనినట్లును, ఆ సంగతి నెట్లో దెలిసికొని పరిత మామె యింటికి వచ్చి మంచముప్రక్కనున్న యాభరణముల నెత్తు కొనిపోవుటకు గంపను సమీపించినట్లును స్వప్నమునఁగాంచి "ఓహో నా సొమ్ము నెత్తుకొనిపోవుటకు నీ వెవరు ! నిన్నుఁ

జంపెదనండు" మని బొబ్బరించుచు మంచమునుండి చేతులఁ జాచెను. ఆయురవడిలో నామె మంచముమీఁదినుండి క్రిందికి దబ్బుకున్నఁ బడెను. ఆమెకు ఆభరణములు రాకున్నను. పడిన దెబ్బచే నడుమును, మోచేతులును నొప్పి బట్టెను.

ఆ నొప్పిచే రాత్రియంతయు నామె నిదురింపలేదు. ఉదయమున నామె లేచి తానా రూపుననే బోయి నాకోకిలనుకనుఁగొని నాలుకను గత్తిరించినదిగదాయని కోపించి తఱిమివేయునేమో యని తన రూపును వస్త్రములచేఁ గొంత మార్పును గావించుకొని పయనమయ్యెను. ముదుసలి వడివడిగ నడిచి శాంతయ్య విశ్రమించిన మఱ్ఱిక్రింద జేరి విశ్రమించెను. కాని యామె కచ్చటఁగూడ శాంతిలేదు.

ఈర్ష్య యొక మహాసర్పమువంటిది. అది యొకపరి హృదయమునజేరినయెడల, దానిని దొలగించుకొనుట శక్యముకాని పని. కొంచెము సమయము దొరికెనేని ఆ భీకరసర్పము తన విషానలముచే నాశనముచేయఁబూనును. అనంతమ్మ యెడఁదఁ జొచ్చిన యీసుకూడ నట్టిదియే, దాని నామె తన కోమల మగు నెడనుండి తఱిమివేయఁజాలకపోయెను. ఎప్పుడెప్పుడు విహంగమువచ్చునా, తన నివాసమునకు గొనిపోవునా? యెప్పుడు బహుమానము లిచ్చునా? యని తలఁచుచు నిదుర బోయినట్లు నటించుచు చీమ చిటుక్కుమన్న పక్షిరాజు వచ్చెనేమో యని యటుగంటఁ జూచుచునుండెను.

కొంచెముసేపటికా కోకిల వృక్షసామీప్యమునఁ జేరి,

"అమ్మా! తా మెవ్వరో దూరప్రయాణ మొనరించి కడు బడలినట్లున్నారు. తమ కభ్యంతరము లేకున్నచో మా నివాసమున కరుదెంచి నేనిచ్చు నాతిథ్యముఁ గైకొనుఁ" డని మనుజభాషణములఁ బ్రేమ యుట్టిపడినట్లనియె. అనంతమ్మ తన పేరు కాంతమ్మయనియు తన స్వగ్రామంబగు బంసోపురము నుండి కలంబాకుఁ బోవుచుండ దారితప్పితిననియు నబద్ధములఁ బలికి యా కోయిల కనుఁబామఁ బ్రయత్నించెనుగాని యా కెంపుకంటికామె నిజస్థితి దెలియకపోలేదు.

అనంతమ్మ కోకిలతోఁ గూడిపోయి యొక గుహఁ జొచ్చెను. అందుఁ బ్రవేశించినదే యాతలిరుమేఁతరి యొక సుందర పురుషుఁడై పోయెను. ఆవింతకథ నావఱకే యా యమ శాంతయ్య వలన వినియుండుటచే నావింతమార్పున కావంతయు వింత బడలేదు. ఆమె కెప్పుడెప్పుడు బహుమానము దొరకునా యను నాత్రము మాత్రము మెండగుచుండెను. ఆ పురుషు డామెకు భోజనమిడి, "ఓ కాంతమ్మా! నేనిచ్చిన ఆతిథ్యమును గొంటివిగదా! అదుగో ఆ మూల రెండు గంపలున్నవి. అందొకటి పెద్దది. మఱియొక్కటి చిన్నది. నీకుఁ గావలసిన వానిలో నొకటి దీసికొనిపొమ్ము, నీవు చూడఁ గడు బీదగ గనఁబడుచున్నావు. ఆ గంపమూతను నీవిలుచేరు నంతవఱకుఁ దెఱవకు" మని జెప్పి యతఁ డదృశ్యుఁడయ్యె.

అనంతమ్మ యానందమునకు మితిలేదు. జరాభరమున శరీరము కృశించుచున్నను అవయవముల బిగిసడలుచున్నను

శరీరము ఎడనడ వడంకుచున్నను ఆమె యాశ కధీనయై యుండుటచే నోపికతోఁ బెద్దగంపనే నెత్తిపై నిడుకొని, భారముచే నొక ప్రక్కఁ గష్టమును, పెద్దగంపయగుటచే శాంతయ్యకన్న తాను తులలేని సంపదల కధీశ్వరినగుదునని యానందము మరియొక ప్రక్కను నామె నూఁగించుచుండెను.

ఆమె కొంతదూరము నడచి యా భారపు గంప నొక చో దింపి దీనియం దెట్టి యమూల్యాభరణములున్నవో మూఁతను గొంచెము పైకెత్తి చూచిన గలుగులోప మేముండునని యాగంప మూఁతను బైకెత్తగనే యందుండి యొక విధమగు పొగయు, భయంకరశబ్దమును బయలువెడలెను. వెంటనే ఇద్దఱు భీకర స్వరూపులా గంపనుండి బయలువెడలి వృద్ధురాలి చుట్టును వికారముగ నృత్యము చేయుచు నామె నాలుకనుగతుక్కునఁ గత్తిరించి "నీ నాలుకవలన చాలమందికి శాంతి భంగమగుచుండెడిది" యని పకపక నగుచుఁ గంటికి నగపడకుండఁ బోయిరి.

అనంతమ్మయుఁ జేయునదిలేక తన్నట్టి స్థితికిఁ దెచ్చిన యాసను నిందించుకొనుచు నిలుసేరి తన దుస్థితికి రేయింబవళ్ళు విలపించుచుండెను. దయార్ద్రహృదయుఁడగు శాంతయ్య యామెకుఁ గలిగిన పరాభవమునకు వగచి యప్పుడప్పు డామెకుఁ గావలసిన సాహాయ్యము చేయుచుండెను.



# మంచి నడవడి

గీ. ఈశ్వరుఁడు తండ్రియని యెంచి యెల్ల జనులు
సోదరులటంచుఁ బ్రేమతోఁ జూచి సర్వ
జంతువులయందు దయగల్గి సాధుశీల
మమరి యుండుట నడవడి నలరఁ జేయు.

"నడవడి మంచిదైనను జనంబులు గొప్పగఁ జూతురాతనిన్"
అనిన కవి మాటలు రిత్తగాదు. నడవడి బాల్యముననే పట్టు
పడవలయును. ఏ విత్తుఁబూడ్చిన నే చెట్టు మొలచునో యదే
ప్రకారము చిఱుతప్రాయమునఁ బట్టువడు మంచి నడవడియో,
చెడు నడవడియో స్థిరముగ మానవునియందు నిలిచిపోవును.
కావుననె మన పెద్దలు మొలకై వంగనిది మ్రానై వంగునా
యని వచించిరి.

తలిదండ్రులు బాలుని శక్తిని గుర్తెఱిఁగి యెట్లు బోధించినఁ
దమ బిడ్డకు మంచి నడవడి, సుగుణము, సువిద్య యలవడునో
యది దెలియవలయును. సువిద్య యను మాట యిందు వచ్చి
నందువలన నావిద్యనుగూర్చి కొంచెము వ్రాయక తప్పినది
గాదు.

ఒక బాలునికిఁగాని బాలికకుఁగాని మంచి నడవడి యల
వడునట్లు చేయు పద్ధతికిని సువిద్య యబ్బునట్లు చేయు
పద్ధతికిని జాల తారతమ్యము గలదు. బాలునికెట్టి
విద్యయందు బ్రీతి గలదో కనుఁగొని యావిద్యయం

దాతనిఁ బ్రవేశపెట్టవలయు. మంచి నడవడి పట్టువడుటకు విద్యయలవడుటకు జెప్పినపద్ధతిఁ ద్రొక్కినఁ జేటువాటిల్లును గావున నట్లుగాక చెడు నడవడిఁ బోవు బాలుని నెంతకైనను నడ్డగించి తర్జన భర్జనములనైన మంచి మార్గమునకుఁ ద్రిప్పవలయు. విద్యావిషయమున, జట్కాబండిదోల జకాయించువానిఁ జిత్రలేఖనమున, గణితమునందు గమనముంచినవాని గనిమకత్తిరింపున, మడకఁబట్ట మమతగొనినవాని మడుగు మంత్రమున, భాషలో భావోద్రేకముగలవాని బట్టలమగ్గమున, కొయ్యపని చేయువానిఁ గోమటియుద్యోగమున, నెనుములుమేఁప నెచ్చరికగలవాని "ఎం, ఏ" చదువునఁ బ్రవేశపెట్టిన ఫలితము గలదా? తామరవట్టినే యలందును, నులవపైరు నీటియందును వృద్ధికివచ్చునా ? నడవడియందు మాత్ర మనుసరింపవలసిన పద్ధతి వేఱు, ఆతీరు వేఱు. భావను గాలఁ దన్నుమని బోధింపఁబడిన బాలుఁడు, పెద్దలు బోధకుల మన్నింపఁబోఁడు. తాతను ఘూయను, తండ్రీ యను తత్త్వము తెలిసికొనిన తనయుఁడు తాతాచార్యుల తిరువారాధన చేయఁబోఁడు. దమ్మిడి దొంగిలి తెచ్చిన తనయుఁడు పెరిగి పెద్దయయినపుడు ధర్మమార్గ మవలంబింపఁ బోఁడు. అదిగో! బూచి, నాన్న, అని చెప్పబడిన చిఱుతడు వయస్సు వచ్చినప్పుడు యుద్ధవీరుఁడు గానేరఁడు.

అందువలనఁ బెద్దలు బాలకులకు బోధించు పద్ధతి చక్కఁగ నెఱుఁగవలయు. బాలురు పెద్దలుచెప్పిన పద్ధతిప్రకారము-

నడచుకొనుట నేర్చుకొన వలయును. బోధించువారు యుక్తాయుక్తము లెఱిగియు, బోధింపఁ బడువారట్టి దాని నమృతోపదేశముగ నెఱిఁగియు, నడచుకొనిన నిఁకఁ గావలసిన దేమున్నది? మరల మంచినడవడికేమికొదువ? ఎచ్చటి బీడీలయంగళ్ళచ్చట బీడువాఱ వలసినదే? ఎచ్చటి మద్యపానశాలలాయెడ మూయబడ వలసినవే! ఎచ్చటి బండబూతులు పలుకు నోళ్ళకచ్చట బీగములు దగిలించ వలసినదే! ఎచ్చటి దెబ్బలాటలచ్చట దాగుఁడుమూఁత లాడవలసినదే! ఎచ్చటి ఘీంకారము లచ్చట నడుగంట వలసినదే! ఓ! అప్పుడంతయు క్రొత్తప్రపంచము! క్రొత్తయానందము! క్రొత్తకళ!—వింత మార్పులు?

బిడ్డలారా! చిఱుత ప్రాయమునుండి పెద్దలు చెప్పెడి గొప్ప వాక్యముల వినుటయే గాక "అయ్యా! నీ మిత్రుని గుణము చెప్పుము. నీనడవడి నేను జెప్పఁగలను" అను సామెతను మనమునం దిడుకొని మంచి సాహసము చేయవలయును. ఎందులకన స్నేహితుఁడు దుర్మార్గుఁ డగునెడల నాతని నడవడిలోనికి నిన్నీడ్చుకొనఁగలఁడు. కావున స్నేహవిషయమునఁ గడు జాగ్రత్తగ నుండవలయు.

భరతఖండము మంచినడవడి గలిగినవారిం గనుటలోఁ గొఱవడినది కాదు. కాని రానురాను, జనులకు నడవడి యను మాటకే యర్థము దెలియుట లేదు. తెలియకపోయినఁ బోవు గాక! ఊరకుండురా యనునదియు లేదయ్యో. నాయనా! నేను

పుట్టంధుఁడను; జ్వరము తీవ్రముగ నున్నది. వైద్యశాలకుఁ ద్రోవఁ జూపుమనిన వైశ్యులవాడకుఁ ద్రోవఁ జూప, వాఁడు నిజమే యనుకొని పోవుచుండ, నేదో ఘనకార్యము చేసిన వానివలె కిసుక్కుమని నవ్వుచుందువే! ధర్మమో రామ చంద్రా యని చేతులు సాచినవాని చేతిలో నొక పెంకుబిళ్ళ బడవేసి చాలు పొమ్మని యెక్కసక్కెము లాడుచున్నావే! మెదడు చెడినవాఁడు వెఱ్ఱిమొఱ్ఱి పాటలు పాడుకొని పోవుచుండ వానిపై ఊలుఉవ్వి వెంద్రుకలు పెఱికి, వాఁడు కుయ్యోమనుచుండ నీ హిహిహీ యని నవ్వుచున్నావే! నిక్కముగ వెఱ్ఱివాఁడెవడు చెపుము? ప్రాణభీతి కంగలార్చుచు కుక్కతోఁకకు టపాకాయ గట్టి వాని నంటించి భళీ యనుచున్నావే! శరీరమంతయు మెడపై మోప శక్తిలేక జుయ్యిమని యెగురుచున్న జీరంగి నింకను బాగుగ నెగురవలయునని మెడలోని త్రాడు బలుమాఱు లాగుచున్నావే! ఎలుకకుఁ బ్రాణసంకటము పిల్లికి చెలగాటము అనుట నీలో సార్థకమగుచున్నదే!

నడవడి మంచిదయిన నిన్ని యవకతవక పనులఁ జేయుట కెడ ముండదుకదా! కావుననే నడవడి సత్పథమునుంచి వేఱు త్రోవఁ ద్రొక్కినప్పుడెల్ల దానిని సరియగు మార్గమునఁ ద్రిప్పుచుండవలెను ఇందులకొక యుదాహరణ మిచ్చెదను.

బీహారు దేశమునకు దక్షిణమునఁ గొంత భాగమును, మధ్య పరగణాలలో నుత్తరమునఁ గొంతభాగమును జేరిన

చోటా నాగపురమను దేశ మేర్పడుచున్నది. ఈ దేశము పూర్వము నుండియు మంత్రతంత్రములకుఁ బ్రసిద్ధి నొందినది. దక్షిణ హిందూదేశమున మళయాళము మంత్రములకు పుట్టి నిల్లని మనమెట్లు దలఁతుమో అట్లే ఉత్తర హిందూస్థాన మంతయు నా చోటి యీ నాగపురమును భావించును. కావున నా దేశమున కుత్తర మళయాళమన్న పేరు గలదు. నా దేశమున కుత్తర మళయాళమన్న దోస ముండదుకదా!

ఆ సీమయందు పర్వతము లచ్చటచ్చట నుండుటచేతను, విశేష భయంకరమగు నడవు లుండుటచేతను ప్రకృతి శోభ, నయనానందకరముగ నుండును. అచ్చట నివసించు జనులు చాల నేర్పరులు. వారిలో స్త్రీలు కూడ మంత్రకర్త్రియలే! మంత్రవేత్తలకు ప్రధానమైనది మంత్రదండము. కాని, చోటి యీ నాగపురపు మాంత్రికులకు, టంబరుమణియను నొక రాయి యంత ముఖ్యమైనది. ఆ దేశమున చాల గణనకెక్కిన పట్టణ[illegible].

రాంచీ నగరము చాల పురాతనమయిన పట్టణము. దానిని వశ్యగుప్తుఁడను రాజు పాలించుచుండెను. అతనికి నుపగుప్తుఁడను కొమరుడుండెను. ఒకనాఁడు రాజసభకు నొక మాంత్రికుఁడు వచ్చి తన విద్యానైపుణ్యముఁజూప, రాజును మిక్కిలి సంతసమొంది గొప్ప బహుమానము వాని కొసగెను. రాజు యొక్క యుదార స్వభావమున కైంద్రజాలకుఁడు చాలఁ దృప్తినొంది తన యుంగరమును అచ్చట గూర్చుండిన యుప గుప్తుని వ్రేలఁ దొడిఁగి రాజువంకకుఁ దిరిగి, "ఓ ప్రభూ! ఈ



" ఉంగరమును అచ్చట గూర్చుండిన యుపగుప్తుని వ్రేలదొడిగి "

యంగుళీయకము చాల మహిమగలది. నీకుమారుడు దుష్కార్యమొనరింప సంకల్పించునపుడెల్ల నా యుంగరమతని నట్టి కార్యములోనికి దిగకుండునట్లు వ్రేలియందొక విధమగు బాధ

నుగలుగఁజేయును. కావున రాకుమారుఁడు తాను జేయు కార్య మిట్టిదని గ్రహింప గలుగును. నేను మరల వచ్చి తీయు నంతవరకు నియ్యది వ్రేలినుండి రానేరదు. నేనప్పుడప్పుడు వచ్చి మిమ్ముల దర్శించు చుండెదనని జెప్పి సభను విడిచి వెడలిపోయెను. రాజగు వశ్యగుప్తుఁడు తన కుమారుఁడిక మీఁద సుగుణ వంతుడగునని సంతసించెను.

కొంతకాలము గడచిన వెనుక వశ్యగుప్తుడు చనిపోయెను. ఉపగుప్తుఁడు రాజ్యమునకు వచ్చెను. అతడు పట్టాభిషిక్తుడైన క్రొత్తలో మంచి నడవడి గలిగియుండెను గాని దుష్ట సాంగత్యమువలన గుణము మాఱుచు వచ్చెను. ఒక నాఁడతఁడు వేఁటకుఁ బోయి యచ్చట మృగము లేమియు దొరకమి మిగులఁ గోపముతో నింటికివచ్చెను. అప్పుడతని చిన్నకుక్క తన యజమానుని యందు ప్రేమఁ జూపింపఁ దోఁక నాడించుచు నాతని సమీపించెను. ఉపగుప్తుఁడు దానిని విసువుతోఁ గాలదన్ని లోనికిఁ బోయెను. అతఁడప్పుడు నోరు లేని యమాయికమగు శ్వానముపైఁ జూపిన నిర్దయ, చాల నసమంజసమని చెప్పుటకో యన వ్రేలియందు సూదితోఁ గ్రుచ్చినట్టులు బాధగలిగెను. రాజకుమారుఁడా నొప్పి వలని యర్థమును గ్రహించి తాను జేసిన కార్యమునకు మిగుల లజ్జించి యిఁక మీఁదఁ జాలన్యాయముగఁ బ్రవర్తింప వలెనని తలఁచెను గాని యది యెట్లు సాధ్యమగును? చేసినపాపము జేబున బెట్టుకొని కాశికిఁ బోయినను పాపములు నశించునా?

దుర్మార్గ స్నేహితుల దగ్గరనుంచుకొని యిఁక మీఁద చాల మంచి నడవడిలో నుండవలయుననిన వీలగునా ?

మరలఁ కొన్ని దినముల కొకనాఁ డుపగుప్తుడు విహారము నకు బయలుదేరెను. ఆతడట్లు కొంచెము దూరము పోవఁగనే యతని కన్నులకొక గొల్లకన్నియ యగపడెను. ఆమె సుగుణ వతియే గాక అందగత్తెగాఁ నుండెను. ఆమె పేరు ఇంద్రాణి. రాజామెను జూచి ! కలుకుఁదనముగ "నీవు నన్ను వివాహ మాడెదవా లేక నిన్ను చెఱయందుఁ బెట్టింతునా" యని యడిగె ! ఆమెకు రాణియగుట మిగులఁ గుతూహలమే గాని ఆతని నడవడి మాత్రము నచ్చలేదు. నిర్భయముగ నామె, "ప్రభుఁడవయ్యు నీ హృదయ మింకను గాఠిన్యము వహించి యుండుటచే నిన్ను వివాహమాడఁజాలఁ"ననియె. ఈ నిర్భయ తిరస్కారమును రాజకుమారుఁడు సహింపజాలఁ డయ్యె. ఆమెనొక గది యందుంచునట్లు తన భటుల కాజ్ఞా పించి తాను దన భవనమునకు మరలెను. ఆసమయమునఁ గూడ నతని వ్రేలియందు బాధకలుగక పోలేదు. ఆబాధకా తఁడు సహింపక యీ యుంగరము నాచిత్తవృత్తికి నాస్వా తంత్ర్యమునకు నడ్డు గల్పించుచున్నదని, దానిని వ్రేలినుండి తీసివేయఁ బ్రయత్నించెనుగాని వ్రేలు కత్తిరింపక యయ్యది వచ్చునట్లు తోఁచలేదు.

ఆరాత్రి యుపగుప్తుఁడు తన స్నేహితులతో విందుగుడుచు చుండఁగొంద ఱింద్రాణి నీతఁడు తప్పక వివాహమాడి తీరవలె

వనియు, ఆమె నమ్మతింపకున్న బానిసగా నమ్మివేయ వలె
నని సలహాల నిచ్చిరి. అతఁడు భోజనాంతర మామెను
బంధించియున్న గదిలోనికిఁబోయి చూచెను. అచ్చట నామె
యగపడలేదు. అప్పుడాతని యాశ్చర్యమునకును, కోపమునకును
మేర యేలేదు.

ఆ సమయమున నాతని స్నేహితులిదే మంచి తరుణమని
తమకు విరోధియు రాజునకు జనక తుల్యుఁడునునగు మంత్రిపై
నపరాధమును ద్రిప్పఁదలచి ప్రభూ! నిన్నెప్పుడును ఇది మం
చిది ఇది చెడ్డదని యాక్షేపించు ముదుసలి మంత్రియే ఆమెను
దప్పించెనని కొండెములు చెప్పిరి. వారి మాటలు వినినదే
తడువుగ నృపగుప్తుఁడు మితిలేని క్రోధముతో వృద్ధ మంత్రి
యగు జనార్దనుని బంధించి తీసికొని రండని సేవకులతో చెప్పి,
తన పడక గదిలోనికి బోయెను.

ఆతని వెనువెంట నెవరో నడచుచున్న చప్పుడు విన
వచ్చెను. వెనుకకుఁ దిరిగిచూడగ నతని వ్రేలిపై నుంగరమిడిన
మాంత్రికుఁ డతని యెదుట దోతెంచెను. ఆతని కన్నులు
కోపమున నెఱ్ఱబాఱియుండెను. అతఁడు రాజు వ్రేలిలోని
యుంగరము నూడఁబెరికి, "అయ్యా! మీ తండ్రికి నేను
నిన్ను సుగుణవంతునిగఁ జేయుదునని మాట యిచ్చితిని. ఈ
యుంగర మప్పుడప్పుడు నీ నడవడి దిద్దుకొనుమని దెలుపు
చున్నను నీవు గమనించక దుర్మార్గుఁడవై చరించు చుంటివి.
నీకు తగుదండన విధింపమి నీవు చక్కఁబడునట్లులేదు. నీకున్న

కోపమునకు తగినట్లు సింహాపు శరీరమును, నీకుఁ గల దురాశకు యుక్తమగునటుల తోడేలు ముఖమును, వృద్ధ మంత్రిని దం డింప బూనిన నీకుచ్ఛితమునకు దగినట్లు పాముతాలుకయును, నీమదాంధత్వమునకు సరియగు నటు లెద్దుకొమ్ములును గల వికృత రూపమును బొందుదువు గాక" యని చెప్పి వెడలి పోయెను.

ఉపగుప్తుఁడు తన శరీరమును జూచుకొనగా మాంత్రికుఁడు చెప్పినటుల అసహ్యాకరముగను, భయంకరముగను నుండెను. అంతియకాక రాచనగరునందు సహితములేక గొప్ప యరణ్య మధ్యమున తా నున్నట్లు కనుగొనెను. తన దుర్మార్గపు జేష్ట లన్నిటిని దలఁచికొని మిగుల దుఃఖించెను. ఆ విచిత్రమృగ రూపు డట్లు విచారించుచుండఁ గొందఱు వేటకాండ్రుచూచి ఇది యొక వింత మృగము. దీనిని పట్టణమునకు గొనిపోయి యాడించిన కొంత డబ్బు రాగలదని దలఁచి గొలుసులచే నా మృగరూపముననున్న రాజకుమారుని దీసికొని పట్టణము లోనికి వచ్చిరి.

పట్టణ మెల్ల యెడల శృంగారింపఁబడియుండుటచే నా వేట కాండ్రు కొందఱిని "పుర మలంకరించుటకుఁ గతంబేమని" యడిగిరి ? అందుల కొకఁడు వారితో "అయ్యలారా ! ఈ పురము బరిపాలించుచుండిన యుపగుప్తుఁ డను రాజు మిగుల క్రూరుఁడు. అతని పరిపాలనమున జనులు చాల బాధలనుభ వించిరి. ఉన్నట్లుండి యొకనాడారా జెవరికిం దెలియక అదృ

క్యుఁడయ్యె. అతని దుష్టస్నేహితులు రాజ్యముకొరకు పెనఁగు లాడుచుండ ప్రజలందఱుజేరి వారిని దఱిమివైచి వృద్ధమంత్రిని సింహాసనాసీనుని గావింపఁబోవుచున్నారు. అదియే పుర మలంకరించుటకుఁ గారణ" మని చెప్పి వెడలిపోయెను.

ఆ మాటలను వినుచున్న వింతమృగము జరిగిన దంతయు విని హుమ్మని హుంకరించెను. మృగయులామృగము హుంకరించుట కర్థము గ్రహింపఁజాలక రెండుకొరడా దెబ్బలనిచ్చిరి. గర్వమునకును చెడునడవడికిని రాదగిన ఫలితము దప్పింప నెవరితరము ? ఉంగరము బాధించుచున్నప్పుడే సన్మార్గమునకు దిరిగియున్నచో నింత ముప్పువాటిల్లియుండదుగదా !

వేఁటకాండ్రా దినము తమకు రాజసభయందు నిట్టి మృగమును జూపిన బహుమాన మధికముగ దొరకఁగలదని యా మృగమును రాజసభకుఁ దీసికొనిపోయిరి.

అచ్చట వృద్ధమంత్రి యగు జనార్దనుఁడు సింహాసన మధిష్ఠింపక తన పూర్వపుటాసనముపైననే కూర్చుండి ప్రజలనందఱుఁగలయఁజూచి "ఓ ! మహాజనులారా ! మీ రందఱు నన్ను రాజ్యాభిషిక్తుఁజేయఁజూచినందులకు మిగులఁ గృతజ్ఞుఁడను. కాని మనరాజగు నుపగుప్తుఁ డింకను సురక్షితముగ నున్నాడని తెలియవచ్చెడిని. అతఁడు నేఁడుగాకున్నను రేపైనను మంచి నడవడిగలిగి మరలరాఁగలఁడని నమ్ముచున్నాఁడను. సర్వేశ్వరుం డతని ననుగ్రహించుఁగాక !

ఈ సింహాసనము—ఈ రాజ్యము—ఈ భవనము—ఈ ప్రజా

సమూహము—వెయ్యేల తుదకు నేనుగూడ—వారికి జేరిన వారమే. వారి పక్షమున మీ యాజ్ఞ ననుసరించి యీ రాజ్య కార్యములఁ జక్కఁబెట్టుచు నతని శుభాగమనమునకై వేచి యుండెద. ” నని వచించెను. ఆపలుకుల కా మృగరూపధారి యగు రాకుమారుఁడు విని మంత్రియొక్క సుగుణములకుఁ జాల సంతసించి తాను రాజుగనున్నప్పు డతనికిఁ జేసిన కీడుదలచి మిగులఁ జింతించెను.

మృగయులామృగమును దా మితర మృగములు పెంచు చోటున నొక బోనులోఁ బెట్టిఁ పెంచుచుండిరి. అట్టియెడ నొకనాఁడొక పులి తన బోనులోనుండి విడిపించుకొని నిద్రించు చున్న తనయజమానునిపై కుఱికెను. అతఁడును నిద్ర మేల్కాంచి ఆచాలల మొకముతో బోరాడుచుండెను. అప్పుడు బోనులో నున్న వింతమృగము, ఇప్పుడైనను పరులకు సహాయముచేసిన బాగుగనుండునుగదా! అని అనుకొనెను. అట్లనుకొనుచుండ గనే బోనుకమ్ములు తమయంతనవియే యూడిపడిపోయెను. ఆఇనుపకమ్ములూడిపడిపోవగనే, ఆ వింతమృగ మొకదూఁకున నాశార్దూలముపైఁబడి తన శృంగములతోఁ జీల్చి చంపెను. ఆసమయముననే “ మంచి నడవడి ఫలితములేకుండఁ బోఁజాల దని యెవరో జెప్పుచున్నట్లు తన చెవులకు వినఁబడెను. తానున్నట్లుండి యొక చిన్న కుక్కగ మాఱిపోయెను.

ఆ వింతమృగ మట్లు మారిపోవుటను జూచిన వేఁటరి యాశ్చర్యమునకు మేరయేలేదు. వింతమృగపు విపరీతపు

టాకారముపోయి వెపిరూపము వచ్చినందులకు రాజకుమారుని సంతోషమునకు మితిలేదు. మృగయుఁడా చిన్నకుక్కను తన గృహమునకుఁ దీసికొనిపోయి యది చిన్నదిగనేయున్న యెడలఁ జాల బాగుగనుండునను తలఁపున దానికి కొంచెముగ నాహారమిడుచుండెను. ఒకనాఁడా జాగిలము తన కిడిన రొట్టె ముక్కను నోటఁ గఱచుకొని యింటివెనుకనున్న వనములోనికిఁ బోయి తిందమని పోయెను.

అచ్చట నదివఱకే యొక కుక్క యాహారము లేక మలమల మాడుచుండుటఁ జూచి తన కాఁకలి వేయుచున్నను సహించి తన రొట్టెముక్క నా శ్వానమున కొసఁగెను. ఆ తరుణమున నెచ్చటినుండియో "మంచి కార్యము మన్ననఁబడ యకపోదు." అని యెవరో చెప్పుచున్నట్లు వినఁబడెను. అప్పుడా చిన్న కుక్క యున్నటులుండి యొక పావురముగా మారెను.

ఆ రాజకుమారుఁ డగు పావురము తన మార్పునకుఁ జాల సంతసించి ఇంద్రాణికి చాలినంత అపకారము చేసితిమిగదా, ఆమె యెచ్చటనున్నదో కనుఁగొని మన్నన వేఁడుకొనవలెనని, జివ్వున నెగిరిపోయెను.

ఆ పావుర మట్లు చాల దూరము కొండలనక కానలనక దాటి పోగాపోగా, నొక గుహయొద్ద నొక ఋషియు, నతనికి పరిచర్య జేయుచున్న యింద్రాణియుఁ గంటఁబడిరి. ఆ కూకి ఇంద్రాణిని గాంచఁగలిగినందులకై మిగుల సంతసమంది యామె

భుజముపై వ్రాలి మన్నింపు మని వేడునట్లు తన ముక్కుతో పలుమారు ఆమె వస్త్రమును మెల్లనఁ బొడుచుచుండెను. ఇంద్రాణియు నింతమంచి పావురము నాకు దొరకెఁగదా యని దాని మేను తన హస్తముతో దువ్వుచు ముద్దిడుకొనెను. ఎదుటఁ గూర్చుండియున్న ముని యుపగుప్తుని వింతమృగముగ మార్చిన మంత్రవాదిగ మాఱి పావురము నుపగుప్తునిగమార్చి వైచి ఆతనితో నిట్లనియె. "బిడ్డా ! నీ మేలుకొఱకే నిన్నిన్ని యిడుమలపాలుచేసితి ! ఇంద్రాణిని చెఱనుండి తప్పించితిని. నీ కిప్పుడు మంచి నడవడి పట్టువడినది. కావున నింద్రాణి నా యాజ్ఞచొప్పున నిన్ను వివాహమాడఁగలదు. అని దీవించి వారిరువుర జనార్దనిని చెంతకుఁ దీసికొనిపోయి రాజకుమారుని సుగుణములగూర్చి ముచ్చటించెను. వృద్ధమంత్రియు రాజ కుమారుని కౌఁగిలించుకొని కుశల ప్రశ్నల నడిగి శుభలగ్న మునఁ బట్టముగట్టి యింద్రాణిని రాణిగఁ జేసెను.



# దైవ మాయ

తే. ఎవ్వనికి నిజ్జగంబున • నెంతఫలము
దైవకృతమగు నదిపొందు • దప్పకతని
గారణముగాదు పెనుఁబ్రాపు • ఘనునిఁజేరు
చాతకముపాతఁ బడునల్ప • జలకణములు.

మాధవుని మాయ నెఱుఁగుట బహు కష్టము. మానవుఁడు తలఁచున దొకటియైన నాతఁడు దలఁచునది మఱియొకటి. అతని యుద్దేశముల నెఱిఁగి నడుచుట మిక్కిలి మంచిది. అయిన నతనిసృష్టి రహస్యములను, ఇచ్ఛను నెఱుఁగుట కష్టము. నవ నవలాడు నందివర్ధన పుష్పమొక నిముషములో వాడి. నశించుచుండ నరికినకొలఁది నాగజెముడెందులకుఁ బెరుఁగవలయు? ముక్కుచు మూల్గుచున్న ముసలి గొట్టుమాలఁబడియుండ ముద్దులొల్కు మూడేండ్ల బాలుఁడు మడియుటకుఁ గారణమేమి? భయంకర భుజగములు భువిని బాగుపడుచుండ పంచవన్నెల రామచిలుక మృగయునిచేఁ బట్టుపడు టెందులకు? ఇట్లెన్నో, తల గొట్టుకొనినను మన కర్థముగా నట్టివిగలవు.

మఱ్ఱిచెట్టున ముత్తెములట్లు చిన్నకాయలు దగిలించి గుమ్మడికిగుంపెడంతకాయల నెందులకు నంటఁగట్ట వలయునని దేవు

నాక్షేపించు ధీరులున్నారుగాని, గొప్ప వృక్షమగు నామత్రికి గుమ్మడికాయలు దగిలించియుండిన చెట్టునీడను జేరు బాటసారిపైఁ బండినకాయ పడుటతో నతని తల పగులునని గ్రహించు కుశాగ్ర బుద్ధులేరి? మనకర్థమయినను సరే కాకున్నను సరే దేవుఁడు చేయునది చేయుచునే యుండును. అతనికి విరుద్ధముగ నెవరును బోఁజాలరు.

మూషిక మాహారము కొరకు కలుఁగులోనికిఁ జొచ్చి క్రూర సర్పముచే, జచ్చుచుండుటలేదా? యజమానునని పెండ్లికిఁబోయి విందు లారగించెదమని లొట్టలువేయు లేకివాడు బస్సులోనుండి బోర్లబడి యమసదనమున విందు గుడువ బోనేల? భోగమనుభవింప బొంబాయిబోయి బొల్లి బూసరతోఁజావనేల. అన్నియు దైవేచ్ఛప్రకారము జరుగకమానవు.

దైవమనుకూలింపనపుడు దొరల బింకముఁగూడ దొరలిపోవలసినదే! ఈవిషయము దెలిసియు మనుజులూరకుండుటలేదు. తానను కొనిన కార్యము పూర్తిగ నెఱవేర్చవలెనని, ఒకటే యోచన, ఒకటే పరుగు, ఒకటే లంపట—కాని ప్రయత్నము పురుషలక్షణము ఫలితము పరమాత్మునిదని యనుకొనుట లేదే! సృష్టిలో మేటివస్తువగు సూర్యునే కన్నులఁదెఱచి చూడలేని మనము కోమలమగు గులాబిని వాడకుండ నొక్క నిముసముగూడఁ జేతబెట్టుకొనఁజాలని మనము-పండినఫలమును కొన్ని దినములైనఁ గుళ్ళకుండఁ బెట్టుకొనలేని మనము, ఎదుటి

వానివన్ని సహేతుకమో అహేతుకమో యెఱుఁగలేని మనము, ఆభగవాను నభిప్రాయ మెట్లెఱుఁగఁగలము ?

మానవు డన్నిటిని తానే చేయుచున్నాననియుఁ జేయించుచున్నాననియు భ్రమపడుచున్నాఁడుగాని నిక్కువముగ దైవాభీష్టమునకు విరుద్ధముగఁ జేయగలుగునా ! సృష్టించినతండ్రినే మఱచినపుడు కార్యములు తానే చేయుచున్నాననుటొక గొప్పయా ! గాలివిమానమున గాల్దేశమునకుఁ బోవలెనని కానంతదూరముననే తలక్రిందుగఁబడి చచ్చుటలేదా! వైద్యులరగంటలోఁ జచ్చునని సెలవిచ్చిన రోగి మరల ముప్పది సంవత్సరములు బ్రతికియుండుటలేదా! కడుపునిండుగఁ బట్టించవలెనని యాకుముందఱఁ గూర్చుండి యొక్క ముద్దతోనే దిక్కురుమనకుండఁ జచ్చినవారులేరా! కావునఁ బ్రతి మానవుఁడు దైవమునందు నమ్మకముంచి కార్యములు చేయవలెను గాని సర్వమునకుఁ దానే కర్తనని యనకొనుట గొప్పతప్పు. ఇందుల కొక యుదాహరణము గలదు.

దక్షిణ హిందూదేశమున పురాతనగ్రామములలో గుఱ్ఱముకొండ యొకటి. ఇచ్చట నొక పెద్ద కొండయు దాని సమీపముననే కొన్ని చిన్న గుట్టలును గలవు. పెద్దదగు కొండపై నబాబు గట్టించిన కొన్ని కోటలును, కొన్ని మందిరములు నున్నవి. ఈ కొండపేరనే యచ్చటనుండు గ్రామము గుఱ్ఱముకొండ యని పిలువఁబడుచున్నది. అచ్చటి వింతకట్టు

డములఁ జూచుటకొఱకై చాల దూరమునుండి జనులు వచ్చుచుందురు. అయ్యది నబాబుల యధీనముగాక మున్నా గ్రామమును దాని పరిసరప్రదేశములను అమరసింహుఁడను రాజు పాలించుచుండెను. ఆతనికి భీమసింహ, ప్రతాపసింహ, రామసింహులని ముగ్గురు కుమారు లుండిరి.

ఒకనాఁ డమరసింహుఁడు తన కుమారుల రావించి "బిడ్డలారా! మీరు మువ్వురును రాత్రి పరుండినపుడు వారివారికి వచ్చు కల లెట్టివో నాకు రేపటి యుదయమున నెఱిఁగింపుఁడు మఱవకుఁడు" అని చెప్పెను.

మఱునాఁడు రేపకడ తనయులు మువ్వురు తండ్రిని సమీపించిరి. అమరసింహుఁడును పుత్రవాత్సల్యమున వారి నందఱఁ గౌఁగిలించి జ్యేష్ఠకుమారుఁడగు భీమసింహునిఁ జూచి, "కుమారా! రాత్రి నీవెట్టి కల గంటి"వనియెను. ఆతఁడు తండ్రితో! "జనకా! మీ యనంతరము మీ సింహాసనముపై నేను గూర్చుండినటులు కలగంటి" నని క్రీగంటఁ దండ్రినిఁ జూచుచుఁ జెప్పెను. అందులకు రాజు, "ఇందేమి యతిశయమున్నది? నీవు పెద్దవాడవగుటచే సింహాసనార్హుఁడవేగదా" అని "ప్రతాపసింహా నీవేమి స్వప్నముగంటి" వని, తన రెండవ పుత్రుని ప్రశ్నించెను. ప్రతాపసింహుఁడు "బాబయ్యా! నేనీ దేశమున గొప్ప ప్రముఖుఁడనయినట్లు స్వప్నముగాంచితి" నని బదులిడెను. రాజును "నీవు రాకు

మారుడవగుటచే నీపరిజలలో మేటివగుట నైజమేగదా,” యనుచుఁ గనిష్ఠపుత్రుఁ డగు రామసింహుని దగ్గరకుఁ బిలిచి, “పట్టీ! నీ కల తెఱం గెట్టిది ?” అని ప్రశ్నించెను. అత డందు లకు “నాయనా! ఉన్న దున్నట్లు చెప్పెదను కోపింపకుము. నే నందఱికన్న గొప్పవాఁడ నయినట్లును, నేను చేయి కడుగ నుద్దేశించిన వెంటనే మా అన్నలు నీరు దెచ్చుటకుఁ బరుగెత్తి నట్లును, మా జనని చేయి తుడుచుకొనుటకు పొడిబట్టఁ బట్టు కొని యుండి నటులను జనకు లగు తాము నా హస్తముపై నీరు పోయుచున్నటులను కలగంటి” ననియెను.

ఆ మాటలు వినినంతనే రాజున కెడలేని గోపము వచ్చెను. అట్టి కల గనుటకు బాలుని లోపము కాదనియు భగవంతు నిష్టప్రకారము కలగనెననియుఁ దెలియక, “ఏమీ! మ మ్మం దఱ నీ సేవకులుగఁ జేసికొంటివా! ఔరా! నీ మదాంధత! కానిమ్ము! నిన్నందఱి కాలు చేతులకు నీళ్లిచ్చులాగునఁ జేసెద నుండు” మని యొక సేవకుని బిలిచి వీని నొక యడవి లో విడిచి రమ్మని చెప్పి, పాప మా పసిబాలుని మెడఁ బట్టి గెంటివైచెను. ఆ రాజసేవకుఁడు రామసింహునాపురికి దూర మున నున్న యొక గుట్టలో విడిచి యా వృత్తాంతమును రాజున కెఱుక పఱచెను.

రామసింహుఁ డనాథబాలకునివలె నా కొండలలోఁ దిరు గుచుఁ బోవుచుండ నచ్చట నొక గుహ యగపడెను. అతఁ

డధైర్యముఁ జెందక యా గవిలోనికిఁ బోయెను. అచ్చట నొక పాత్రలో కొంచె మాహార ముండెను. తా నాఁకలిగొని యున్నందున నాహారము నంతయు భుజించి యందే నిద్రించెను. అట్లుత డెంతయోసేపు నిద్రింపక మునుపే యేదో పాదముల చప్పుడు వినవచ్చుటచే దిగ్గన మేల్కాంచి చూడగా నా గుహలోనికిఁ గొన్ని మేఁకలను, అన్నిటికన్న వెనుక నొక పెద్దమేఁకపై నొక యంధుఁడు గూర్చుండి లోనికి వచ్చెను.

ఆ గ్రుడ్డి యా మేఁకపై నుండి దిగి యచ్చట నున్న యాహారపాత్ర పై కెత్తి యది తేలికగ నుండుటచే నందు బోనము లేదని గ్రహించి, యెవరో! యాహారము నంతయుఁ దిని వైచిరి, వారు నా కన్నులఁ బడిరేని చంపక విడుతునా యని యా గవి యంతయుఁ బ్రతిధ్వనించునటుల బొబ్బరించెను. రామసింహున కప్పుడు తనది కాని వస్తువు నితరుల యనుజ్ఞ లేక భుజంచిన తప్పు దెలిసెను. విశేష క్షుద్బాధచేఁ బీడితుఁడై యున్నందున నతనికి బోనము నారగించినపుడు దెలియక పోయెను. కావున నా చిఱుతఁడా యంధుని సమీపించి "అయ్యా! నా తప్పు క్షమింపుము. నే నొక దిక్కులేని బాలుకుఁడను. విశేషముగ నాఁకలివేయుటచే తమ యుత్తరవు లేక భుజించిన నేరమును మన్నింతువుగాక" అనియెను. అందుల కావికలాంగుఁడు "సరియే! నీవు సత్యము చెప్పినందువలననిన్ను మన్నించితిని. నీవు నాకు వండిపెట్టుచుండు" మని జెప్పెను.

ఆదినమునుండియు రామసింహుఁడు కుండగోఁకరిగ నుండ, గ్రుడ్డియజమానుఁడు తన మేఁకల మేఁపుకొనుటకై పోవుచుండెను. ఇట్లు పదిసంవత్సరము లెప్పుడో ఱెక్కలు గట్టుకొని యెగిరిపోయెను. రాకుమారుఁ డొకనాఁడు యజమానుని సమీపించి, అయ్యా! తాము వృద్ధులైతిరి. ఇంకను మీరు బైట బోవు టంతగా మంచిదిగాదు. తా మింట నుండుఁడు, నే నీ మేఁకలఁ గాయఁ బోయెద ననియె. అందుల కా వృద్ధుఁడు! “రామసింహా! కానిమ్ము రేపటినుండియుఁ బెద్దమేఁకపై నెక్కి మిగిలిన మేఁకల నడవికిఁ దోలుకొనిపొమ్ము. అయిన నొకమాట, నీవు మేఁకల మేఁపుటకు దక్షిణపుఁ బ్రక్కనున్న కొండకుఁ దప్ప మిగిలిన యన్ని కొండలకుఁ బొమ్ము. జాగ్రత్త, నా మాటయందు లక్ష్య ముండనిమ్ము” అనియెను.

రామసింహున కిప్పు డిరువదేండ్లు. దక్షిణపుఁ గొండలో పెరిఁగిన గడ్డి యుండియుఁ దన యజమానుఁ డచ్చటికిఁ బోవల దని నిషేధించుటకుఁ గారణ మేమో యెఱుఁగవలయునని తా నా మృగము లన్నిటి నొకనాఁడు దక్షిణపుగుట్టకే తోలుకొనిపోయెను. మేఁక లన్నియు నానందముగ మేయుచుండెను. రామసింహుఁ డొక చెట్టుక్రిందఁ గూర్చుండి ప్రకృతిసౌందర్యమునుఁ జూచుచు నానందించుచుండెను. సుమా రిట్లొక గంట యయ్యెనదో లేదో పది పండ్రెండుగురు విశాలాకారు లచ్చటి



ఒకగంట యయినదో లేదో పదిపండ్రెండుగురు వికారాకారు
లెచ్చటినుండియో వచ్చి యతనిచుట్టు ముట్టిరి.

నుండియో వచ్చి యతని చుట్టు ముట్టిరి. వారిలో నొకనిచేత పట్టుకా రుండెను. వారినిఁ జూచినంతనే రామసింహునకు నవ్వు వచ్చెను. ఎందులకన వారిలో నొక్కడును రెండున్నర యడుగు

కన్న పొడవు లేఁడు. వారు ధరించిన యుడుపులు గూడ మిక్కిలి నవ్వు పుట్టించునవిగ నుండెను.

వారందఱు రామసింహుని చుట్టును నాడుచుఁ గన్నుల బెఱికి వేయుఁడు, వీని యజమానుని కన్నుల నూడఁ బెఱికియు వీఁడిచ్చటికి బెదరులేక వచ్చెనుగదా!" అని యఱచుచుండిరి. అప్పుడతఁడు వారితో నిట్లనియె!" అయ్యలారా!. నా కన్ను లందు మీ కంత ప్రీతి గలదేని దీసికొనుఁడు. నేను వలదనుట లేదు. మీరు చేయలేని కార్యమేదియు నుండదు. మీరీ చెట్టు కొమ్మనెగిరి దాటగలిగితి రేని నానయనముల మీసొత్తుగ భావింపుఁడు లేకున్న నన్ను బాధింపక విడిచిపెట్టుఁడనియె. అందులకు వారు సమ్మతించిరి. వారిలో పెద్దవాఁడు కొమ్మను దాటుటకు నెగిరెను గాని యాశాఖయందు వాని వస్త్రములు దగుల్కొనుటచేఁ గ్రిందికి వ్రేలాడుచు నన్ను విడిపింపుఁడు. లేకున్నఁ గ్రిందఁబడి చచ్చెదనని యేడ్వఁజొచ్చెను. మిగిలిన వారు మిగుల పొట్టివారగుటచే వానిని విడిపింపలేక రామసిం హుని సహాయము గోరిరి.

అతఁడు "కన్నులు పోయిన తన యజమానునికిఁ గన్నుల నిచ్చిన వ్రేలాడు వానిని విడిపించెద" ననియె. అందులకు వారొక మూలిక నిచ్చి దాని రసమును కన్నులలో పోసినఁ గన్నులు వచ్చుననిరి. రామసింహుఁడా మూలికను భద్రముగ దాఁచుకొని కొమ్మకుఁ దగుల్కొనిన వానిని విడిపించి మేఁకలతో గుహను జేరెను.

వృద్ధునికి రామసింహుఁడు తెచ్చిన మూలిక సహాయమునఁ గన్నులు వచ్చెనుగాని అందుల కతఁడెట్టి సంతృప్తియు నగపఱచక నాఁడు మొదలు తానే మేఁకల మేఁపుటకుఁ బోవుదుననియు, నచ్చట నున్న యెనిమిది గుహలలోనికిఁ బోవచ్చునుఁ గాని తొమ్మిదవ గవిలోనికిఁ జొరఁగూడదనియుఁ జెప్పి వెడలి పోయెను.

తొమ్మిదవగుహ నెందులకుఁ జూడవలదని వృద్ధుడు చెప్పెనో యది తెలిసికొనవలెనని రాకుమారుఁడు సంకల్పించుకొనియెను. అతఁడా గుహలోనికిఁ బోగా నందొక బంగారు వన్నెగల యొకయశ్వమును, సువర్ణపు జీనియు నుండెను. రామసింహుఁడా యుడుపుల ధరించి వారువముపై నెక్కి దౌడు తీయుటకు నుండ వృద్ధుడప్పుడే మేఁకలుఁ దోలుకొనిగుహకు వచ్చి రామసింహుఁడు తేజిపై నుండుటఁ జూచి "ఓరీ! నాగుఱ్ఱము నపహరింపఁ జూచెదవా! నిన్నుఁ జంపివేయుదు" నని పరుగెత్తి వచ్చుచుండెను. రామసింహుఁడు గుఱ్ఱమునుఁ బరుగెత్తించెను. వృద్ధుఁడును గన్నుల నిచ్చిన దాతయని యెంచక తిట్టుచుఁ గడుఁ గోపమున నతనినిఁ జంప నుద్దేశించి యొక కత్తి నెత్తుకొని తఱుముకొని వచ్చుచుండెను. సర్వేశ్వరుఁ డాతనిఁ గృతఘ్నుఁడనుకొనెను కాఁబోలు, వృద్ధుఁడు పరుగెత్తుచుండి యొక పెద్ద రాతిపై నుండి జాఱి క్రిందఁబడి మృతుఁడయ్యెను.

రామసింహుఁడు బంగారు దుస్తుల ధరించి బంగారు జీనిఁ గూర్చిన పైఁడి వన్నియ తేజినెక్కి పోవుచుండఁ జూపరుల

కతఁడొక దివ్యపురుషుని వలె నగపడు చుండెను.

అతఁడు తన తండ్రియగు నమరసింహుని పురము ప్రవేశించెను. రాజును నతని పుత్రులు నా నూతనపురుషుఁ డెవఁడో గొప్ప చక్రవర్తిగ నుండనోపునని యాతని నెదుర్కొని తమ నగరులోనికి దోడ్కొనిపోయిరి. తగిన యాసనముపైఁ గూర్చుండఁబెట్టిరి. కుమారుఁడు భీమసింగు సువర్ణ కలశమున నీరములు దెచ్చి రామసింగు చేతులపైఁ బోయ నమరసింహు డతని చేతులఁగడిగి ప్రక్కను చేతులు తుడుచుకొనుటకు తుండుగుడ్డ పట్టుకొనియుండిన రాణిగారినుండి యావస్త్రమును దీసికొని తడిచేతులఁ దుడుచుటకు సిద్ధపడు చుండెను.

పాప మతనికిఁ బదిసంవత్సరములకు మునుపు పోయిన తన కుమారుఁ డతడని యెట్లు దెలియును? రామసింహుఁడు తండ్రి తన కేలు దుడుచుచుండఁ బక్కుమని నవ్వెను. అందుల కమరసింహుఁడు నివ్వెఱపడి, మహాశయా! తాము నవ్వుటకుఁ గారణంబేమని యడిగెను.

రామసింహుఁడు తా నెవ్వరైనదియు, దన కల యెట్లు నిజమైనదియు విశదీకరించెను. అమరసింహుడు తనపుత్రుఁడు మరల దొరకినందులకు సంతసించుచు, దైవేచ్ఛ యనుకూలింపక మానవుని ప్రయత్న మెప్పటికిని గొనసాగదని గ్రహింపఁ గలిగెను.

---

# స్నేహము

---

తే. అఘము వలన మఱల్చు హి ♦ తార్థ కలితు
జేయుఁ గోప్యంబు దాఁచుఁ బో ♦ షించు గుణము
విడువఁ డాపన్ను లేవడి ♦ వేళ నిచ్చు
మిత్రుఁడీలక్షణంబుల ♦ మెలఁగుచుండు.

స్నేహము పాత్రతనెఱిఁగి చేయవలయును. అట్లుగాకున్నఁ గొన్ని సమయముల దుష్టస్నేహము లభ్యమగుట గూడఁ గలదు. ప్రపంచమున మంచి మైత్రివలనఁ గలుగు లాభమున కన్న వేఱొకటి లేదు. ఆదినుండియు భారతమాత శ్రేష్ఠులగు చెలిమికాండ్రనుఁ గనుటకు వెనుదీసినది కాదు. సుగ్రీవుఁడు తన ప్రాణములఁ దృణముగ నెంచి శ్రీరామచంద్రునికి సీతనుఁ దెచ్చుటయందుఁ దోడ్పడుట నెయ్యమే కారణముగదా.

మన దేశమట్టి సద్భావము గలిగినందులకు మిగుల గర్వించుచుండెడిది. కాలము మాఱిన మాఱినను నా నెయ్యము గూడ నొయ్యారముగ మాఱినది. నవ్వించువాఁడు నేస్తుఁడు, చాటు నిచ్చువాఁడు చెలిమికాఁడు, (షేక్ హ్యాండు) కరచాలనము నిచ్చువాఁడు స్నేహితుఁడు, పండ్లిగిలించువాఁడు పొత్తుకాఁడు, సరసము లాడువాఁడు సంగడీఁడు, సిగరెట్టుఁగాల్చనిచ్చువాఁడు సఖుఁడు, మోసముచేయువాఁడు మిత్రుఁడు. వ్యర్థములుపల్కువాఁ డొమ్మికాఁడు. సుస్నేహము సువర్ణ ఘటమువంటిది.

బంగారుకుండ దొరకుట దుర్లభము. అది యేమఱుపాటున బగిలినను దాని నతికించుకొనవచ్చును. మానవుఁడు మఱి యొకని సహవాసముఁ గోరినపుడు పగిలి దబ్బలగు మట్టికుండ వంటి స్నేహము తగదని గుర్తెఱుఁగ వలెను.

రైలుబండిస్నేహమను నొక నూతన విచిత్రస్నేహమిక్కాలమున బయలుదేఱినది. రైలుపెట్టెలోనెక్కి కూర్చుండినదె ప్రక్కనున్నవారిని "ఏమండీ! ఎచ్చట తాము రైలెక్కుట, ఎచ్చట దిగుట, అని రెండు మూఁడుపోద్ఘాతవచనములువదరి, అయ్యా ఒక చిటిక పొడుము నిచ్చెదరా! ఒక సిగరేటు ముక్క నిటులఁబడవేయుదురా యని యేదియో యొకటి యాతనియొద్దనుండి యూడఁబెఱికి, తమకు బిడ్డలెందఱు? మిమ్ములనెప్పుడో చూచినట్లున్నదే! అను నిత్యాదివాక్య పరంపరల రైలుప్రయాణపు తుదివఱకు జరపి, దిగిపోవునపుడు, ఏమండీ! జ్ఞాపకముండవలెను! మన స్నేహము మఱవఁదగినదికాదు, తామప్పుడప్పుడు జాబులు తప్పక వ్రాయుచుండవలెను. మాగృహమున కొకపర్యాయము తాము దయచేయవలెనని వందనము లాచరించుకొనిపోవుచున్నారు గాని మరల జాబులు వ్రాసికొనుటకు వారొకరికొకరు వారి నామధేయము లడిగియుండినఁగదా! వీరు రైలు దిగినవెంటనే వారిమాటయే జ్ఞప్తియుండదు.

ఇట్టి స్నేహముగూడ నిక్కాలమున గొప్పదిగ నెన్నఁబడుచున్నది. స్నేహమనునది యింతటి తేలికవస్తువుగాదు.

నెయ్యమేర్పడినతర్వాత నెన్ని యిడుమలు వచ్చిననుసరే! తుదకు ప్రాణము లర్పించవలసియుండుననుట మఱవక బలీయనిపించుకొనవలెను గాని మిత్రుఁడు బాగుగనున్నప్పుడు మొగమోటమిలేక మెసవి వాఁడు ద్రవ్యహీనుఁడయినంతనే "తామెవరండీ" అను ఘాతుకపుమాటలకు దిగుటనింద్యము.

మిత్రునిదంతయు మనకు రావలెనని కోరుట మతిలేనితనము. క్షీరనీరములు గలియునట్లొకరికొకరికి మైత్రి గలిసిపోవలెను. అప్పుడే యాస్నేహమందగించును. కడుపున గొండంత కపటముపెట్టుకొని పైకి నిచ్చకపుమాటలతో స్నేహము కల్పించుకొని సమయమువచ్చి పిలువవచ్చిన స్నేహితునికి ఇంటలేడు పొమ్మని చెప్పి పంపు బుద్ధిహీనుల నెందఱ మనము చూచుచుండుటలేదు! మృగములుగూడ స్నేహమననెట్టిదో మానవులకు నప్పుడప్పు డెన్నెన్నియో నిదర్శనములు చూపియున్నవి. అట్టివానిలో నొకటి యిందుఁబొందుపఱచెదము.

మహానది హిందూదేశములోని ప్రాముఖ్యనదులలో నొకటి. అయ్యది బస్తరుకొండలలోఁబుట్టి యుత్తరముగాఁ గొంచెము దూరమును తూర్పుముఖముగ మఱికొంచెముదూరమును ప్రవహించుచుఁ గొంతదూరము దక్షిణముగఁగూడఁ దిరుగవలెననికాబోలు నున్నటులుండి యొకచోట దక్షిణమునకుఁ దిరుగుచున్నది. ఆ ప్రదేశమున సుప్రసిద్ధమగు శాంబలుపురమను పట్టణము గలదు. అందొకప్పుడు రామసింగను

కసాయి నివసించుచుండెను. అతఁడు వాడుక మేరనొక దినము మాంసవిక్రయమునకై తన యంగడినంతయు పరిశుభ్రపఱచి మాంసశకలములన్నియుఁ బైకప్పునుండి వ్రేలాడుచుండిన యినుపకొక్కెలకుఁ దగిలించుచుండెను. ఆ సమయమున నచ్చటి కొక శ్వానమరుదెంచెను.

ఆ కుక్క మిక్కిలి యంగహీనమయ్యు సరియగు నాహారములేమి మిగులఁ గృశించియుండెను. అది యాఁకలిచేత నెక్కువ బాధఁజెంది గడగడ వడఁకుచుండెను. నా కొక్క మాంసఖండమును బడవేసి నా యాఁకలి మాన్పఁజాలవా యను నర్థమిచ్చుచూపుల నామాంసవిక్రయుని జూచుచుండెను. అతఁడా జాగిలముపై జాలిగొని రెండంగుళముల మాంసపు ఖండము నొకదానిని బడవేసెను. ఆ ముక్క భూమిపైఁబడుటకుమున్నె యా కుక్క కటుక్కునఁబట్టి దిగమ్రింగెను. ఆ చిత్రవైఖరి యా సూనరికిఁగొంత సంతసము గలిగించెను. కావున మరల నొక బ్రద్దను పైకెగురవైచెను. మరల నదేవిధముగ నావేసి దానిని మార్గమధ్యముననే పట్టుకొని దిగమ్రింగెను. ఇటుల నాలుగయిదుసారులు జరిగినతర్వాత నాకటిక యొక పెద్ద ముక్కను బడవైచెను. ఆపర్యాయమా మొఱుగుమెక మా మాంసమును దిగమ్రింగక నోటఁగఱచుకొని యెచ్చటకో పరుగెత్తెను.

అట్లా శ్వానము ప్రతిదినము రామసింగు సంగడికి వచ్చి కడపట వేయుచుండెడి పెద్ద ముక్కను నోటఁ గఱచుకొని

పోవుచుండెను. ఒక దినము గూడఁ దప్పక మాంసపు ఖండము నెచ్చటకుఁ దీసికొని పోవుచున్నదో కనుఁగొన వలె నను కుతూహలమా సూనరికిఁ గలిగెను. వాఁడుక మేరకు విశ్వాస్ మాంసపు దునియను నోటఁ బెట్టుకొని పరుగెత్తు చుండెను. విశ్వాస్ అని రామసింగా కుక్కకిడిన ముద్దుపేరు. కుక్కను వెన్నంటి కసాయికూడఁ బరుగెత్తెను. విశ్వాస్ ఆ పట్టణములోని మూలనున్న యొక పాడింటఁ జొరఁబడెను. రామసింగు గూడ దాని వెంబడి యా గృహములోనికిఁ జొచ్చెను.

ఆయింట నొక శిథిలమగు పీపాయందొక మిగుల కృశాంగమై లేచుటకుఁ గూడ శక్తిలేని మరియొక వేపి యుండెను. విశ్వాసా మాంసఖండమును దాని ముందటఁ బడవైచెను. ఆ శునకము దాని వాసన చూచుచుండెనే గాని దానిని గొఱుకుటకు బలములేమిఁ బ్రయత్నించలేదు. విశ్వాసా నంజుడుతుండును జిన్నచిన్న ముక్కలుగఁ గొఱికి తోఁక నాడించుచుఁ దానా తుండ్లను మ్రింగున ట్లభినయించుచు మరలఁ బడవేయుచు "ఓ! స్నేహితుఁడా యీ ముక్కల నైనను దినుము. లేకున్న నేను తినివేయుదు" నని భయ పఱచుటకుఁ జెప్పుచున్నలాగునఁ జేష్ట లొనరించు చుండెను కాని మిత్రుఁడగు కుక్క శక్తిలేమిఁ దినఁజాలక పోయెను.

విశ్వాస్ యొక్క విశాల భావమునకును, ఔదార్యము నకును రెండవ జాగిలపు దుస్థితికిని రామసింగు కన్నులనీరుఁ

గాఁజొచ్చెను. అతఁడు ప్రక్కయింటికిఁ బోయి యొక మృణ్మయి పాత్రయందు నీరుతెచ్చి యా యెమ్ములగూఁడగు కుక్కకుఁ బెట్టెను. అదియు నా నీటిని జూచినదే తోఁక నాడించుచు నెన్ని దినముల నుండియో నీరుత్రాగని యాత్ర మును జూపించునట్లు గతికి కొంచెము శక్తి వచ్చినదానివలె గన్పట్టెను. విశ్వాస్ రామసింగు తన మిత్రునికిఁ జేసిన సహాయమునకు సంతసము దెలుపుచున్నట్లాతని పాదముల నాకి సాగెను.

రామసింగు తన దుకాణములోనికి వచ్చి యచ్చట మాంస క్రయమునకు వేచియుండు వారందఱికి విశ్వాస్ యొక్క మృదు హృదయమును గూర్చియు, దానికి మిత్రుని యందుఁ గల విశ్వాసమును గూర్చియు, ముచ్చటించుచు మన పురమున నెట్టి భక్తునకు నైనను నిట్టి త్యాగబుద్ధి లేదని వక్కాణించెను.

బిడ్డలారా! రామసింగు చెప్పిన మాటలయం దేమేని యబద్ధమున్నదా? మనుష్యులు తమకు లభించిన దానితో వెయ్యింట నొక భాగమైనను గాసంతకూడ లభ్యముగాని, నిర్భాగ్యునకు, నిరాధారునకు, నిశ్శక్తునకు, నిరాడంబరునకు, సహాయ్యము చేయుదురా! వారు తినుతిండి, వారనుభవించు నానందము వారిదేగదా! సర్వసౌఖ్యము లనుభవించుచుండు మానవుఁ డెప్పుడేని ముచ్చటకునైనఁ గూటికిలేని, దిక్కులేని, రోగబాధ ననుభవింపలేని వారినిగూర్చి యొక నిముసమైన

యోచించు చున్నాఁడా ?

సాంబలుపుర మంతయు విశ్వాస్ యొక్క చరిత్ర మా బాల గోపాల మనుకొనుచుండెను. పెక్కండ్రు గుంపులు గుంపులుగ రామసింగు దుకాణమునొద్ద మూఁగి యా గ్రామ సింహమును జూచి వేనోళ్ళ దాని గుణములఁ గీర్తించు చుండిరి.

కొన్ని దినములు గడచిపోయినది. ఇప్పుడు విశ్వాసముతోఁ గూడ రోగముచే బాధపడుచుండిన కుక్క కొంచెము శక్తి వచ్చుటచేఁ గాబోలుఁ గసాయి యంగడికి వచ్చుచుండెను. రామసింగు మాంస మమ్మువాఁడయినను స్వభావమున మిగుల దయాళుఁడు. కావున నా రెండు కుక్కలు తనగృహము నందే నివసించుటకు తగు నేర్పాటు గావించెను. అతఁడు పెట్టు నాహారము వలన విశ్వాస్ మాత్రము పుష్టి చెందెను. గాని దాని మిత్రునకుఁ గండపట్టలేదు.

సాంబలుపురము పెద్దది కానుకాను నచ్చటఁ బురపరిపాలకసంఘ (Municipality) మేర్పడెను. ఆసంఘ సభ్యులు బయట దిక్కులేక తిరుగుచుండెడు కుక్కలనన్నిటిని బట్టి చంపింప వలెనని యొక్క చట్టమేర్పాటు చేసిరి. నోరులేని జంతువులపైఁ గూడ నిట్టి చట్ట మేర్పాటు చేసినందులకును భగవంతుని సృష్టిని నశింపఁ జేయుటకు మానవుడు కంకణ మీవిధముగఁ గట్టుకొని నందులకుఁ గొందఱు ప్రాజ్ఞులు చింతించిరి.

చట్టము మేరకొక దినమిద్దఱు సంఘసేవకులు కొన్ని శునకములఁ బట్టి యొకబోనువలె నుండు బండిలోవేసి త్రోసికొని పోవుచుండిరి. ఆసమయమున రామసింగు, దగ్గఱనున్న గ్రామమునకు పశువుల వ్యాపారార్థము పోయి తనగుఱ్ఱముపై వచ్చుచుండెను. అతఁడట్లు వచ్చుచుఁ గుక్కల బండి సమీపమున నిలచి "నావిశ్వాసును దాని మిత్రుఁడును నీవేత్రహస్తులకుఁ జిక్కియుండరు గదా" యని యనుకొనుచు నాపెట్టె కమర్చియుండు నినుపఁగూచల సందునఁ దొంగిచూచెను. ఉన్నటులుండి యాకుక్కల నడుమనుండి కెవ్వుమని యొకవింత శబ్దము వచ్చెను. అయ్యది తన విశ్వాసానర్పిన శబ్దమేయని యతఁడు నిశ్చయ పఱచుకొని యాబండి త్రోయువారిని దన కుక్కనిమ్మని అడిగెను.

కాని వారందులకు సమ్మతింపరైరి. రామసింగునకుఁ బట్టరాని కోపము వచ్చెను. తానా కుక్కనుఁ దనప్రాణము వలెఁ గంటికి ఱెప్పవలెఁ దనయాప్త మిత్రునివలెఁ గాపాడుచుండెను. కావున నతని దేహమతని కప్పుడు దెలియుటలేదు. ఏప్రక్క జూచినను విశ్వాసముయొక్క మురిపెంపు మోము గన్పట్టు చుండెను. రామసింగు ఆహంతకుల నిద్దఱను గ్రిందికిఁ బడద్రోసి వారితోఁ బెనఁగులాడు చుండెను. ఆవిషయము నంతయుఁ జూచుచుండిన ప్రజలందఱు విశ్వాసును బ్రేమించిన వారగుటచే నాగ్రహావేశ పరవశులై యాబండి తలుపుల నూడబెఱికి వానితో నున్న కుక్కలన్నిటిని విడిపించిరి.

విశ్వాసమును దాని చెలికాఁడును రామసింగుతోఁ గూడ నింటికి వచ్చి సుఖంబుండెను. కొన్ని దినములు తాళి యెట్లో రెండు శునకములు వారికిఁ బట్టుపడెనని విచారింప మొదట బలహీనమగు శునకము పట్టుపడెననియు నదిచూచి విశ్వాస్ వారిని జూచి మొఱిగి బెదరించఁ జూచెను గాని వారట్టి బెదరింపులకు భయపడమిఁ దానుగూడ శక్తిలేని దానివలె నటించి వారికిఁ జిక్కెననియుఁ దెలిసెను. చూచితిరే! యిచ్చటఁ గూడ మిత్రుని త్యాగబుద్ధి! ఆహా! తన స్నేహితుఁడు పట్టుపడుటచేఁ దానుగూడఁ బట్టుపడి ప్రాణములు వదలుట సమంజసమని యనుకొనెను గదా!

రామసింగు ప్రతిదినము నారెండు కుక్కల మిగుల మక్కువతో సాకుచుండెను. ఒకనాఁటి యుదయమున నెప్పటియట్ల యతఁడు నిద్రనుండి లేచినదే "విశ్వాస్, విశ్వాస్" అని పిలెచెను గాని విశ్వాసముగాని దాని యనుచర మృగము గాని రాలేదు. చుట్టుప్రక్కల వెదకెను గాని వాని జాడ గాన రాదయ్యె! రామసింగు మిగుల ఖిన్నుఁడయ్యెను.

తన భార్యను దుకాణముఁ గాచియుండుమని చెప్పి, విశ్వాస్ మాంసము తెత్తుకొనిపోయి స్నేహితున కిడుచుండిన ప్రదేశమునకుఁ బోయెను. అతఁ డూహించినటుల విశ్వాస మచ్చటనే యుండెను. ముఖమున దీనత్వము తోఁప పీపాప్రక్క మొగము ద్రిప్పి కూర్చుండి యుండెను. రామసింగు దానిని



"ఏమి విశ్వాస్! అట్లున్నావు! నీ స్నేహితుఁడు కుశలమే గదా!"

సమీపించి "ఏమి విశ్వాస్! అట్లున్నావు! నీ స్నేహితుఁడు కుశలమేగదా" అని దాని వీఁపుమీఁదఁ దట్టుచు పీపాలోనికి తొంగిచూచెను. రెండవ కుక్క చనిపోయి దాని శరీరము కొయ్యబాఱి యుండెను. విశ్వాస్ కన్నుల వెంటనుండి నీరధిక

ముగఁ బ్రవహించుచుండెను. కసాయి యచ్చట నొక చిన్న గుంటలో మృతిఁజెందిన కుక్కకళేబరమును బూడ్చివైచి విశ్వాస్‌ను దనవెంటఁ దీసికొని వచ్చెను.

విశ్వాస్ మరల మునుపటివలె మాంసము నాచోటికిఁ దీసికొనిపోవుట కారంభించెను. రామసిం గెంత ప్రయత్నించి నను దానిని సంతోషపఱచి ఆహార మిడలేకపోయెను. ఎచ్చట నేని తన స్నేహితునివంటి కుక్కను విశ్వాసము చూచెనేని అచ్చటికిఁ బరుగెత్తి అయ్యది తా ననుకొనిన మృగము కాదని తెలిసికొని విచారముతో వెనుకకు మరలుచుండెడిది. ఏసమయ మునం దైనను తన మిత్రుఁడు చనిపోయిన స్థలముననే కూ ర్చుండి యుండెడిది. ఇట్లయిదుదినములు గడచెను. ఆఱవదిన ముదయమున రామసింగు చిన్నబిడ్డవలె నేడ్చుచు విశ్వాస్ యొక్క కళేబరమును మోసికొని వచ్చి తన యింటి వెనుకఁ బూడ్చుచుండుట జను లందఱు చూచి మిక్కిలి దుఃఖించిరి. పాపము స్నేహితుఁడు లేక యా నాలుగుకాళ్ల జంతు వీ ప్రపం చమునఁ దన ప్రాణమును నిలుపుకొనలేకపోయెనుగదా!

---

# సత్యము

క॥ సందిగ్ధ భాషణంబులు
నిందాన్వితములును ద్వంద్వ ♦ నియతార్థములన్
జెందిన మాటల నాడకు
మీ దనృతఫలంబు గలుగు ♦ నరయగుణమణీ!

"సర్వవేళలఁ బల్కు సత్యంబె తన తల్లి" యని యార్యులు పల్కిన వాక్యమున లోప మేమున్నది? సత్యము వచింపని మానవుఁడు, సన్మార్గులలో నొకఁడుగ నెన్నఁబడఁడు. అట్టివాఁ డెన్నటికేని పరిహాసపాత్రుఁడే. కల్లలాడువారు తమ గుంపునకు మఱియొక్కఁడు చేరెనని సంతసించెదరు. యదార్థవాది బహుజనవిరోధి అనునట్లు నిజము పల్కువాఁడు ఇది నీతి, ఇది న్యాయ మని యెఱుఁగని మనుజులకుఁ జులకనగునేమోగాని, మహాపురుషులకును దేవునికిని మిక్కిలి దగ్గఱగఁ జేరుచున్నాఁడు. ఎంతటి బుద్ధిలేని మానవుఁడైనను దేవుని సమీపముచేర నిచ్ఛగించునే గాని చెడ్డవారికి మంచివాఁడను గాకపోతినిగదా యని యంగలార్చునా? ప్రతిమనుజునికిని సత్యము పలుకవలయు నని యిచ్ఛ యున్నది గాని యట్లు పలుకుటవలన తాను జేసిన తప్పు విదిత మగునేమో యను భయమున నెన్నియో కల్ల బొల్లిమాటలచేఁ దన తప్పు నొప్పుగఁ జేయఁ బూనును గాని నిజము నిలకడమీఁద నైనఁ దెలియకపోవునా?

సహజముగఁ దప్పులుజేయుట మానవస్వభావము. దానిని గప్పిపుచ్చ నెన్నియో యసత్యములు పలికి తన నేరము గొప్ప దిగఁజేసికొనుటయేగాని కల్లలుపలికినంతమాత్రమున దోసమును దొలఁగించుకొనఁగలడా ? ప్రతి మనుజుఁడు సత్యముపలుక నల వాటు చేసికొనవలెను. బాల్యమునుండి నిజమేపల్కవలెనని పట్టుపట్టి సత్యమునే వచించుటకు వెనుదీయకుంటిమేని దబ్బఱ లాడువారికది యెట్లు సహజసంభాషణముగనున్నదో యట్లే సత్యము పలుకుటగూడ స్వభావసిద్ధమైపోవును. లేనిదున్నట్లు నున్నది లేనట్లుఁ జెప్పుటకుఁ గొంచెము యోచనగావలెను గాని యున్నదున్నట్లు, లేనిదిలేనట్లు వచించుటకు యోచన మక్కఱలేదుగదా !

సత్యముకొఱకు సతీసుతుల నెడఁబాయుటకు హరిశ్చంద్రుడు వెను దీసినవాఁడుకాఁడు, తండ్రిమాట యసత్యముగాకుండుటకుఁ బదునాల్గువర్షములు కానలలో సీతాలక్ష్మణులతో నిడుమలఁ బడుటకు శ్రీరామప్రభువు కష్టమనినవాఁడుకాఁడు. సత్యవాక్య పరిపాలనముకొఱకుఁ బాతాళమునకణఁగ ద్రొక్కబడిన బలి వెతఁజెందినవాఁడుకాఁడు. అట్టి సత్యసంధులు, అట్టి మహా పురుషులు వసించిన దేశమున నివసించుచు, వారుచ్ఛ్వాస నిశ్వాసము విడిచినగాలినే పీల్చుచు వారు ద్రాగిన నదులలోని నీరములే త్రాగుచునుండు మనకు వారి సత్యసంధతలో వారి యథార్థవచనపాటవములో శతాంశమైన సహస్రాంశమైన నుండవలసినపనిలేదా ?—లేదే !—రానురాను మనము సత్యహరి

శ్చంద్రులమని, కల్లలాడుకోణంగులమని, యథార్థమెఱుగని యడిబిండలమని యనిపించుకొనుచున్నారమే! కొంచెముగూడ నసత్యమునకు జంకుటయున్నదా ? కలఁతలు బెట్టుటకుఁగల్ల—నవ్వులాటలుకు నసత్యము—మోదమునకు బొంకు కాసునకు గల్ల—పొట్టకూటికి బొల్లు—మాటలో మతకము—చూపులో జూణుకు—మనసులోఁ దాటోటు—నడకలో నసుకు—జీవనమున జల్లి—ఇట్లు మన బ్రతుకులు దిగిపోయినవి—సత్యమునకున్నంత గౌరవము— సత్యములోనున్నంత సంతోషము— నిజములో నున్నంత నయము—మఱి దేనియందును లేదు. బొంకువారికి ప్రథమమున సంతోషమగుపడినను, తుదకు జెప్పరానికష్టమును, దుఃఖమును ననుభవింపవలసియుండును. సత్యమువలన మొదటఁ గష్టమనిపించినను, గడపట శాశ్వతసుఖ మనుభవింపనగును. సత్యమే జయము. సత్యమే మానవునికి రక్షవంటిది. ఇందులకు నిదర్శనముగ నొక కథ గలదు.

పంజాబుదేశమున కుత్తరమునఁ గాశ్మీరమను స్వదేశ రాజ్యము గలదు. ఆంగ్లేయులు పంజాబును స్వాధీనముచేసి కొనకమునుపీరాజ్యమును రంజితసింగు పరిపాలించుచుండెను. ఆతని యనంతర మతని పుత్రుఁడు దులీపుసిం గింగ్లీషువారికి యుద్ధపరిహారమునకై యొకటిన్నరకోటి రూప్యము లీయవలసి యుండుటచే గులాబ్ సింగను నతనికిఁ గాశ్మీరమును విక్రయించ వలసినవాఁడాయెను. అప్పటినుండియు గులాబ్ వంశమువారే యీ రాజ్యమును బాలించుచున్నారు. కాశ్మీరము తూర్పు

ప్రపంచపు నందనవనము (paradise of the east) అని పిలువఁ బడుచున్నది. ప్రకృతిసౌందర్యమంతయు నా దేశముననే మునుముందు పుట్టి తదుపరి యితర సీమలకుఁ గొంచెము కొంచెముగ వ్యాపించినట్లుండును. ఇచ్చట చలి మిక్కుటమును దుర్గమయమును నగుటచే జనులు మిగుల బలిష్ఠులుగను, గష్ట జీవనమునకు వెనుదీయనివారుగను నుందురు.

ఈ దేశము వివిధములగు నింపుగొలుపులతలకును, వింత వింతవన్నెల పుష్పములకును రసభరితములగు ఫలవృక్షము లకును మిగులఁ బ్రసిద్ధి. నదులు విశేషముగ ప్రవహించుటచే నావాహినులపైఁ దేలియాడుచుండు తోటలు (Floating gardens) గలవు. అచ్చటివారు గొప్ప గొప్ప కొయ్యల సముదాయముచే నొక తెప్ప గట్టి వానిపై మన్ను కొంచెముగ పఱచి దానిపై కూరగాయలతోటలనాటి నదులలో విడచెదరు. కొయ్యతో గట్టిన నా తెట్టువతోఁటతో తేలియాడుచుండును. వారచ్చటచ్చట నదీతీరములనున్న పురములఁజేరి యచ్చట ప్రజలకు నప్పుడే గోసిన శాకములను విక్రయించుచుందురు. ఈ యద్భుతమును ప్రకృతసౌందర్యము లను జూచుటకు బశ్చిమఖండవాసులుగూడ నెడతెగక వచ్చు చుందురు. కాశ్మీరమునకు ముఖ్యపట్టణము శ్రీనగరము. ఆపట్టణము శ్రీమహాార్యచక్రవర్తియగు నశోకునిచేఁ గట్టబడి యుండుటచే మిగుల పురాతనమగు పట్టణము. అందుఁ

పూర్వము శుభ్రదత్తుఁడను నొక భాగ్యవంతుఁడుండెను. ఆతడు మిగుల సిరిగలవాఁడయ్యు లోభమునకు మాత్రము దాసుఁడయ్యెను. పాపమతనివిధి.

శుభ్రదత్తునికి సత్యవతి యను కుమార్తె గలదు. చిన్న నాఁటినుండియు నామెకు సత్యమన్న నెక్కుడు గౌరవము. మాణిక్యమని పేరుపెట్టిన కాశిరంగువానివలె, రామచంద్రుడని పేరు బెట్టుకొనిన పితృదూషణునివలె, శాంతకుమారి యని పేరు బెట్టుకొనిన కోపవతివలె, పన్నీరుశెల్వమని పేరుపెట్టుకొనిన దుష్టమనుష్యునివలె గాక సత్యవతి యను పేరు శుభ్రదత్తుని తనయకుఁ దగియుండెను. ఆమె యెక్కసెక్కమునకైన నసత్యత మాడియెఱుగదు. అట్టి యామె సుగుణమునకుఁ దగినట్లు సౌందర్యముగూడ నుండుటచే నాపురముననున్న ధనవంతు లందరు నామెను దమ కోడలినిగఁ జేసికొన నువ్విళ్ళూరు చుండిరి.

ఆపురముననే యొక బీదకాఁపు నివసించు చుండెను. ఆతని పేరు రత్నయ్య. ఒకనాఁడతఁడు పొలమునుండి యింటికిఁ బోవుచుఁ గొన్ని వంట చెఱకుల నేరుకొని పోయెను. ఆతని భార్య యాకట్టెల నందుకొని క్రిందఁ బెట్టఁగనే యామోపులో నుండి యొక చిన్నపాము వెలికి వచ్చెను. ఆమె యాగాలి తిండిని జూచి యాహా! దేవుడిట్లు సర్పములకు బిడ్డల నిచ్చు చున్నాఁడు గాని నాకియ్యడయ్యెఁ గదా! యని చింతించు

చుండ నాబాలోరగము; "అమ్మా చింతింపకుము. నీకు బిడ్డలకు బదులుగ నన్నే పెంచుకొనుము. నేను హానిచేయ" నని మనుష్య సంభాషణమునఁ బలికె. అది విని రత్నయ్య భార్య మిక్కిలి యచ్చెరువంది యింతటి వింత లెందును గననైతిమి. పాము మాట్లాడుచున్నదే యిందేదో రహస్యముదాగియుండ నలయు చూచెదగాక యని ఆవిసదారిని మిగుల మక్కువతో బోషించుచుండ నాపడగదారియుఁ గ్రమక్రమముగఁ బెరిగి పెద్ద దయ్యెను. ఒకదినమా త్రాచు రత్నయ్యను బిలచి! నాయనా నేను పెండ్లి చేసుకొనవలయును. ఈపట్టణములోని శుభ్రదత్తుని కుమార్తెను, నాకు వివాహమాడవలెనని యున్నది. మీరు బోయి సత్యవతిని నాకిమ్మని నడిగి రండ" నియెను. రత్నయ్య యేమియుఁ దెలియని మానవుఁడగుటచే శుభ్రదత్తు నింటికిఁ బోయి "అయ్యా! మీసత్యవతిని నాకుమారుడగు సర్పరాజునకు వివాహము చేయించెదరా" యని యడిగెను. అందుల కతఁడు నవ్వి, పామునకేమి? కన్యనిచ్చుటయేమి? కానిమ్ము. వీని నొక విధముగ సాగనంప వలయు నని "రత్నయ్యా! మాయింటి వెనుక బంగారు పండ్లు ఫలించు చెట్లు గలుగునట్లు చేసినచో నాకుమార్తె నీకోడలు గాఁగలద" నియెను. అతఁడింటికిఁ బోయి జరిగిన యుదంత మంతయుఁ బూసగ్రుచ్చినట్టులు పాఁప పట్టికిఁ జెప్పెను. ఆసర్పము రత్నయ్యతో, "అయ్యా!

అది యెంతటిపని! నేను బండుకొనుచోట నొకమూట యున్నది. దానిని విప్పితివేని అందొక విధమగు పొడి గలదు. దానిని నీటిలో గలిపి కొన్ని మామిడి టెంకల నానీటిలోనద్ది వారిగృహము వెనుకఁ బూడ్చి రమ్ము" అని వాక్రుచ్చెను! రత్నయ్యయుఁ గుమారుని మాటయందు నమ్మకముంచి తాఁజెప్పినట్టులు చేసెను. కడపటి విత్తును బూడ్చినంతలో నదివఱకుఁ బూడ్చిన టెంకలన్నియుఁ జెట్లై బంగారు మామిడి కాయలతో నుండెను. రత్నయ్య యాశ్చర్యమున కంతులేదు. ఆసమయముననే సత్యవతి తండ్రి యచ్చటికి వచ్చి యావిచిత్ర దృశ్యమును జూచుచు నిలువఁబడి పోయెను. అప్పుడు రత్నయ్య, "అయ్యా! మీరు చెప్పినట్టులు చేసితిని. ఇంకనేమైన నభ్యంతరమున్నదా?" అని ప్రశ్నించెను. అందుల కాధనికు "డింక మఱియొక పని బాకీయున్నది. మాగృహ కుడ్యములును నేలయు సువర్ణ మయమగునేని మీకుమారుడు మాయల్లు డగుటకు సందేహము లేద"ని బదులిడెను. రత్నయ్య యీరెండవ సందేశమునకుఁ గుమారుఁడేమి పలుకునో యని సంశయించుచు నింటికి వచ్చి సర్పమునకు విషయము నంతయు నెఱింగించెను. ఆపుట్ట కాఁపరి, తండ్రి యగు రత్నయ్యతో "అప్పా ఈయూరి కుత్తరమున నొక పుట్టగలదు. ఆపుట్టపై నొక చెట్టుగలదు. దాని కొమ్మలు కొన్ని దెచ్చి శుభ్రదత్తునింటి గోడలను నేలను వానితో నూడ్చు" మని

చెప్పెను. రత్నయ్య తన కుమారుఁడు చెప్పినటులఁ జేయఁగా శుభ్రదత్తుని యిల్లంతయు బంగారు మయమాయెను. ఆభాగ్య వంతుఁడు తన గృహమంతయుఁ గాంచన మయమగుటచే నబ్బురపడి సత్యవతిని బిలిచి జరిగిన సమాచార మంతయుఁ జెప్పి యామె నా పామునుండి తప్పింప నుపాయముతో దూర మునను్నఁ బెదతండ్రి నెలవునకుఁ బొమ్మని చెప్పెను. సత్య వతి జనకుఁడు చెప్పినదంతయు విని "తండ్రీ! తాము నన్నా సర్పమున కిచ్చెదమని మాట నిచ్చితివి. చెప్పి తప్పుటకన్నఁ బాప మింకొకటి కలదా? లోకులు మిమ్ముల నసత్యవాది యని బిలువరా? మీ సత్యమును నిలుపుట కొఱకు నేనా సర్పమునే వివాహమాడుదును" అనియెను. అతఁడు చేయు నదిలేక తన లోభము తన్నింతవఱకుఁ దెచ్చెఁగదాఁ యని చింతించుచు రత్నయ్యనుబిలిచి యతని కుమారుని బిలుచు కొని రమ్మనెను. పెండ్లికుమారుని తలిదండ్రులా త్రాచును సత్యవతి నెలవునకుఁ దోడ్కొనిపోయిరి. ఆ సర్పమును జూచి నదే శుభ్రదత్తుఁడును నాతని భార్యయు మిగుల భీతిజెందిరి. సత్యవతి నెపుడు దిగమ్రింగునోయని యామె తల్లి బావురు మని యేడ్చుచుండెను. తన కూఁతు దుస్థితికిఁ దానే కారణ ముగదాయని మిగుల వ్యథఁజెందెను శుభ్రదత్తుఁడు!

సత్యవతి మాత్రము మనస్సున నేలాటి దుఃఖమును భయ మును లేక జనకుని సత్యవాక్య పరిపాలనార్థమై తన శరీరమును



అప్పుడే యా సర్పము ఒక సుందరుఁడగు మానవుఁడుగ మాఱెను.

లెక్క సేయక యాపాము నెదుట నిలిచెను. అప్పుడే యాసర్ప మొక సుందరుఁడగు మానవుఁడుగ మాఱెను. సత్యవతి సంతసమునకు మేరయే లేదు. ఇంతకొక క్షణమునకు మునుపు పాముగా నున్న నాయందగాఁడు సత్యవతిని జూచి మిగుల సం

తోషించి ఓ! కన్యకా! నీ జనకుని నసత్య నిందనుండి దొలఁగింపఁబూనిన నీ త్యాగము బహు శ్లాఘనీయము. నేను పురుష పురపు (Peshawar) రాజకుమారుఁడను. ఒక నాఁడొక మునిపుంగవుని ప్రోల నవ్వులాట కొక కల్ల చెప్పి నందుల కాతాపసోత్తముఁడు కనులెఱ్ఱఁజేసి తొమ్మిది సంవత్సరముల వఱకు నీ సర్పరూపమున నుండవలెననియు సత్యవతి యను సత్యసంధురాలి దర్శనమువలన నీరూపు పోవుననియు శాపంబిడెను. ఆమునీంద్రుని వాక్య ప్రకారము నీ దర్శనముచే నా నిజరూపంబుఁ బొందితిని. నిన్నుఁ దప్పక వివాహమాడెదనుగాని యీ జటదారి యాజ్ఞ ప్రకారము నవవర్షములు పూర్తియగుటకు మూఁడుదినములు తక్కువగ నున్నది. మరల నా సర్పరూపును ధరించెదనని చెప్పి తన పాముతోలువంకఁ జూచెనుగాని వారిద్దరును మాట్లాడుచున్నప్పుడు సత్యవతి తల్లి తన కంతటియల్లుఁడు దొరకి నందులకు మురిసి మరల నతఁడు పామురూపు నెత్తునేమోయని యచ్చటఁ బడియున్న పాము కుబుస మతనికిఁ దెలియకుండ నెత్తుకొనిపోయి కాల్చి యుండుటచే నచ్చటనది యగపడలేదు. అప్పుడా రాజకుమారుఁడు జరిగినదానికిఁ జింతించి యొక పావురపు రూపు నెత్తుకొని తుఱ్ఱున నెగిరిపోయెను. సత్యవతి యతడట్లు తన్ను విడిచి పరుగిడి నందులకు నేడ్చుచుఁ దలిదండ్రులకుఁ గూడఁ జెప్పకుండ నా గువ్వ పోయిన దిక్కునకుఁ బరుగెత్తుకొని పోయెను. ఆకు

యల్లెన్నిమైళ్ళు పరుగెత్తెనో యామెకే తెలియదు. అట్లు పోవుచుండఁ దోవ యందొక యందగత్తె యామె కగపడి యామెను నిలిపి యట్లు వ్యసనముఁ జెందుచు గుట్టలనక, రాలనక, చెట్లనక, పుట్టలనక పరుగెత్తు చుండుటకుఁ గారణమడిగి యామె చరిత్రమును విని మిగుల నాశ్చర్యమొంది "అమ్మా! నీ సత్యమునకు మిగుల నానంద మొందితిని. మూఁడు దినములవరకీ చెట్టుక్రిందనే యుండుము. మూఁడవదినము సాయంకాలమునకు నీ భర్తయగు యీ పావురపు వేసదారి యీ వృక్షపు గొమ్మపై వ్రాలును. అప్పుడు నీవీ యిసుక నాకపోతముపైఁ జల్లుము, నీభర్త యెప్పటియట్ల తన రూపమును బొందును. నేనీ వనదేవతనని, యిసుకనిచ్చి యామె యదృశ్యయయ్యెను.

ఆ వనదేవత చెప్పినయట్లు సత్యవతి యాకలి దప్పులకు నోర్చి; చలిని సహించి యా వృక్షము నొద్దనే యుండెను. మూఁడవదినము సాయంకాలమున నొక పావురము తిన్నగ నువచ్చి యా చెట్టుకొమ్మపైఁ గూర్చుండెను. ఆసమయమును గుర్తించి సత్యవతి వనదేవతను మనమునందుఁ బ్రార్థించి యిసుకను కాపోతముపైఁ జల్లగనే చెట్టుపైనుండి రాజకుమారుఁడు పక్షిరూపము వదలి క్రిందికి దిగివచ్చెను.

అప్పటికి యా దంపతుల యానందము మేరయే లేదు. పురుషపురపు యువరాజు సత్యవతితోఁ గూడఁ దన రాజ

ధానికిఁ బోయి యామెను వివాహ మాడి శుభ్రదత్తుని కా శుభవ ర్తమానము చెప్పి పంపెను. చూచితిరే సత్యమున కెంత శక్తి యున్నదో! మఱియొక మాట రత్నయ్యను నతని భార్యను రాజపుత్త్రుడు మరువక విశేష ధనమున బంపెను. ఆ ధనముతో వారు జీవిత మంతయు సుఖముగఁ గడపఁ గలిగిరి.

---

# ఆశ

క॥ కరచరణాద్యవయవములు
ఖరముడిగెన్ వళులు మొగముపై నిండారెన్
శిరసెల్లఁ దెల్లఁబాఱెను
దరిమాలిన తృష్ణ యొకఁడె తరుణతఁ బూనెన్॥

ఆశ యంతములేనిది. జగత్తునంతయు నొక త్రుటిలో మ్రింగివేయువలయు ననునట్లు వచ్చిన మేఘము రానురాను బలుచనగుచున్నది. పర్వతరాజ మనఁబడు హిమాద్రిపైకిఁ బోనుపోను సన్నగిలుచున్నది. ప్రళయమువలెఁ జూపట్టి భూనభోఽంతరాళమునఁ దన జ్వాలలచే నొక్కటిగఁ జేయు భూకంపము క్షణక్షణమునకు క్షీణించుచున్నది. మింటికిని మంటికిని బ్రహ్మాండదీపమువలె వెలుంగు భానుని తేజము దినము గతించను గతించను సన్నవాఱుచున్నది, కాని మానవుని చిన్న హృదయమునఁ బుట్టు తృష్ణ మాత్రము తఱుఁగుటలేదు.

మానవుఁడును శతవృద్ధుఁ డగుచుండినను, అతనిలోఁ జనించు నాస మాత్రము యౌవనావస్థయందే యున్నది. అది శరీరముతోఁడ ముదుసలి దగుటలేదు. ఎన్ని యున్నను దనకు లేని వస్తువే యానంద మొదఁ గూర్చునది యని మనుజుఁడు భావించును. నిమిష నిమిషమునకు మార్పుఁ గోరని నరుఁడు లేఁడు. లక్షాధిపతికి లకారము కకారముగా లేదని లంపట పుత్త్రులు గలవానికి నాఁడు బిడ్డలు గలుగలేదని యంగలార్పు-

ఒక్క వస్తువుఁ గలవానికి రెండు వస్తువులు లేవని వెత. డబ్బు గలవానికి భూమి లేదని వెడద. పదవిగలవానికిఁ బైపదవి రాలేదని పోక్కు. బిచ్చగానికిఁ గడుపునకు లేదని కస్తి. కళ్యాణ మాశించినవానికి కాంత కుదురైనది కాదని కసమస. రాజ్యము గలిగిన రాజునకు రారాజు గాలేదని రవరవ. ఇట్లు పిడక లేరువాని మొదలు పుడమి పతివఱకుఁ దన కున్న దానితో సంతృప్తిపడువానిఁ గనలేము.

ఆశయములు చెల్లించుకొనుటకు మానవుఁడు తన కున్న కొంచెము సుగుణమునుఁ గూడ మట్టిఁ గలిసి దుండగములు చేయఁ బూనును. ధన మెచ్చుచున్నకొలఁది గాంక్ష గూడ హెచ్చుచుండును. కావుననే యర్థవంతుఁడుకాను కాను లోభము హెచ్చుచునే యుండును. ధన మెచ్చినకొలఁది మన మెచ్చక, తన ధనమును బీదసాదులకు సాహాయ్య మొనరించుట తన విధి యనియు, పేద కానకాను కడుపుఁగూటికొఱకు నీచపుఁబనులు చేయక సానపెట్టఁబడిన రత్నమువలెఁ గష్టములచే సానపెట్టఁబడి ప్రకాశింపవలె ననియుఁ బెద్దలు వచింత్రు.

భగవంతుఁడు ధనవంతుని యాశ యెంతవఱకుఁ బోవునో చూచుటకొఱకై, వాఁడు కోరుకొలఁది నిచ్చుచుండును. బీదవాని యోర్పెంతవఱకున్నదో తెలియుట కొఱకై వానికింకను లేమినిఁ గలుగఁజేయు చుండును. ఈరహస్యమును మనుజుఁ డనుభవమునఁ దెలిసికొనుచున్నను దైవేచ్ఛ ప్రకారము నడచుకొనుట లేదు! సరిగదా! ఆశకధీనుఁడై

తాను జేయక విడువని యకార్యమెద్దియు లేదు. హంస తూలికా తల్పంబునం బవ్వళించు వారును, వట్టి నేలపై నిద్రించు వారును, శ్రీయుతులును, గూలివాండ్రును, రూప వంతులును, గురూపులును, నంత్యకాలమున నొక పడకపైం బవ్వళింపం బోవుట నిక్కమని తెలిసికూడం దాను శ్రీమంతుండగుటకు నెన్నో తలతిక్క పనులను జేయుచు సంతృప్తి యనుమాట నెఱుంగకున్నాండు. ఇందుల కుదాహరణముగ నొక చిన్న కథ గలదు.

వింధ్యపర్వతము మొదలు కన్యాకుమారి వఱకుం గల దక్షిణ హిందూ దేశమునకు దక్కనని మాఱు పేరు గలదు. అందు ప్రవహించు చుండు నదులలో నెల్ల గోదావరి మిగులం బెద్దది. అయ్యది పడమటి కనుములలోం బుట్టి తూర్పుగాం బాఱి సముద్రమునం గలియుచున్నది. గోదావరి సస్య సమృద్ధికి నాధారభూత యగుటచేతను, రాక పోకల కను వగుటచేతను అప్రాంత్యమువారు "గోదావరి తల్లి" యని బిలుచుట కూడం గలదు. యీనది శ్రీనాసికాత్ర్యంబకను వోట పుట్టుచున్నది. ఇచ్చట కిరువది మైళ్ళ దూరమున నాశిక యను దివ్యక్షేత్రము గలదు. ఆపట్టణమును ప్రతి వత్సరము వేలకు వేలు యాత్రికులు దర్శించుట వాడుక.

నాసికయందు బాహు, సుబాహు, దీర్ఘబాహులను మువ్వు రన్నదమ్ము లుండిరి. వారు బీదవారయ్యు మిగుల సుగుణాత్ములనియుం, గనికరము గలవారనియు జను లనుకొను

చుందురు. వారి కొక మామిడిచెట్టు గలదు. ఆ వృక్షము ఫలభరితమైనప్పుడు ముగ్గురును వంతుప్రకార మొక్కరొక్క రుగఁ గావలిగాయుచుండిరి.

ఆ సహోదరుల యౌదార్యబుద్ధినిఁ బరీక్షింప వలెనని యొక ఋషి యా చెట్టును సమీపించెను. ఆ సమయమున పెద్దవాఁడగు బాహుఁడు కావలిగాయుచుండెను. ఆ ఋషి యాతనిఁ జూచి అయ్యా! నేను మిక్కిలి యాఁకలిచేఁ దపించుచుంటిని నాకుఁ గొన్ని పండ్లు నిచ్చిన నీ పేరు చెప్పుకొని కడుపు నిండించుకొనెదనని విన్నవించెను. బాహుఁడా జడదారినిఁ జూచి నమస్కరించి చెట్టునందున్న తన వంతు ఫలము లన్నిటిని గోసియిచ్చి "అయ్యా! నా భాగమునకు రావలసిన పండ్లన్నియుఁగోసియిచ్చితిని. దీనిని దాము దీసికొని, కొన్నిటి నాహారముగ నుపయోగించుకొని కొన్ని పండ్లను విక్రయించి తమకు వలయు వస్త్రములఁ దీసికొనుఁ" డని సవినయముగఁ బల్కెను. ఋషీశ్వరుఁడు వాని ధర్మగుణమునకు మిక్కిలి సంతసించెను.

మరలఁ గొంత సేపటికి రెండవవాఁడు తనవంతుమేరకుఁ గాపుకాయుటకువచ్చి యన్న నింటికిఁ బంపివైచెను. తన సహోదరుని ప్రార్థించి ఫలములఁగొనిపోయిన ఋషియే మరల సుబాహునొద్దకు నేతెంచి మొదట నాతని యన్న నడిగిన ప్రకార మాతనినిగూడ నపేక్షించెను. సుబాహు తనవంతు ఫలముల నన్నిటిని గోసి "మునీంద్రా తామడుగు

టయు క్షేమము లేదనుటయూ! అట్లెప్పటికినిఁ గానేరదు. ఎన్నియో పాపంబులఁజేసి యీ బీద జన్మమెత్తినారము, ఇంకను దానాది విషయంబులయందు యాదరములేకుండుట మానాశనమునకుఁ గారణమగును గావున నీ ఫలములన్నిటినిఁ దాము గైకొని మమ్మాశీర్వదింపుఁడని" మఱిమఱి విన్నవించెను.

ఆ తాపసోత్తముఁ డాతని గుణంబుల కాశ్చర్యమంది మూఁడవ వాఁడగు దీర్ఘ బాహువు కావలిఁగాయు చున్నప్పు డతనిని దగ్గఱి తాను మిగుల నాఁకలిగొన్న వానిపగిది నటించుచుఁ గొన్ని ఫలముల నాసించె.

దీర్ఘ బాహువు తన యన్నలవలెఁ జెట్టులో మిగిలినఁదన భాగపు పండ్ల నన్నిటినిఁగోసి యాభక్తుని ముందిడి "ఓ సాధుపుంగవా! మిమ్ము సంతృప్తునిగఁ జేయునంతటి ధనము నాయొద్ద లేనందులకై చింతించు చున్నాఁడను. ఈ ఫలము లైనను గొనిపొండని" భయభక్తులతో వాక్రుచ్చెను.

ఆమఱుచటి దినమున ఋషీశ్వరుఁడు బాహు, సుబాహు దీర్ఘబాహుల గృహమునకుఁ బోయి వారినందఱిని జూచి "బిడ్డలారా! మీ దయాళుత్వమునకు నేనెంతయు నానందించితిని. నా వెంటరండు, మీకోరినవరముఁ బ్రసాదించెద"నని చెప్పి వారిని దోడ్కొని యటవీ మార్గముఁ బట్టెను. వారట్లు కొన్నిక్రోసుల దూరము పోవగ నచ్చట నొక కొండకాలువ మిక్కిలి వేగముగఁ బ్రవహించుచుండెను. అచ్చట నాముని పెద్దవాఁడగు బాహునిఁజూచి "అయ్యా! నీవు కోరిన వరము

నిచ్చుటకు సిద్ధముగ నున్నాఁడను, ఏదో నొకటి గోరికొనుమ" ని చెప్పెను. అందుల కాతఁడా సెలయేటివంకఁ దిరిగి నేను యేటియందు ముంచి యెత్తికొనిన నాపాత్రలోని జలము పాల గుచుండునట్లు ప్రసాదింపుమని వేడుకొన, నమ్మునీశ్వరుండట్లే యగుఁగాక యని చెప్పి మిగిలిన నిద్దఱిఁ దోడ్కొని కొన్ని మైళ్ళదూరము పోయెను. అచ్చటవారొక గొప్పమైదానమున లెక్కలేని యడవి పావురములు గుంపులు గుంపులుగ నాహారము నేఱికొని తినుచుండుటఁ జూచిరి. రెండవవాఁడగు సుబాహుఁడా తాపస చంద్రునిజూచి "యీ పావురము లన్నియు గోవులగునట్లు చేయు"డని కోర నాతఁడును "నీయిష్టప్రకారము జరుగుగాక; నీ వీ గోసముదాయంబును మేఁపుకొనుచు గొప్ప భాగ్యవంతుఁడవు గమ్మని దీవించి మూఁడవ వాని వెంటనిడుకొని యచ్చటనుండి కదలెను.

కొంతదూరము పోయి యతఁడు దీర్ఘబాహునిఁజూచి "నీ గోరికనుఁగూడ దెలుపు" మని యడిగెను. దీర్ఘ బాహువు చేతులు జోడించి నమస్కరించుచు "మాపాలిటి కల్ప వృక్షమగునో మునిపుంగవా! మాయన్నలవలె నాకుఁ గోరికలు లేవు. కోరికలచే గుణము రాను రాను చెడిపోవచ్చును. అందువలన బీదసాదుల కనువగు సాహాయ్యము నేఁజేయలేక పోయి నిష్కరుణుఁడఁ గావచ్చును. కావున మహాత్మా! తమ పాదసేవ చేయుచు, బీదలకు సదా సాయపడుచు, సర్వేశ్వరుని స్మరింపుచుఁ గాల మొకరీతిఁ గడపు నుద్దేశమొకటి దప్ప నాకు

గావలసిన దేదియు లేద"ని బదులిడెను.

అంత నా ముని దీర్ఘబాహుని సుగుణముల కచ్చెరువుపడి చిఱునవ్వు నవ్వుచు "వత్సా! నీ బుద్ధియే నిన్ను గొప్పవానిని జేయగలదు నా వెంటరమ్ము" అని యా జటాధారి సమీప రాజ్యమున నున్న యొక రాజునొద్దకు నాతనిఁ దీసికొనిపోయి రాజు కూతును తన వెంటనున్న దీర్ఘబాహుని కిచ్చి పెండిలి జేసిన బాగుండునని తన యభిప్రాయ మాతని కెఱుకపఱచెను.

ఆ పుడమీశునకొక కుమార్తెగలదు. ఆమె మంచి గుణములను విని యాదినమే యిద్దఱు రాజులామెను వివాహమాడ వచ్చియుండిరి. ఆ భూపాలునకు మునివెంట వచ్చియుండు బీద యువకునికి తన కూతునిచ్చుట కిష్టములేదు. అయిన నాతపసిమాట త్రోసిపుచ్చఁజాలక వచ్చిన మువ్వుర నొకచోటఁ గూర్చుండఁబెట్టి తన కూఁతుఁ బిలువనంపి యామె కెవరిపై బ్రీతియో దెలుపుమనియెను.

వచ్చినవారలలో నొకఁడు బట్టతలగల వృద్ధభూపాలుఁడగుటచేతను, మఱియొకఁడు కొయ్యబారిన కొక్కిపండ్లు కుచేలుఁడగుట చేతను, వారి నా రాకుమార్తె వివాహమాడ నొల్లక మూఁడవవాడగు నిఱుపేద యువకునే తనకు పెండ్లి సేయుమని తండ్రినిగోరెను. కాని యాయేలికకు తన కుమార్తెనట్టి దరిద్రనారాయణున కిచ్చుట కిష్టపడమి నేమి జెప్పుటకును దోఁచక యోజించుచుండెను. అతని యుద్దేశమెఱింగినముని శ్రేష్ఠుడు రాజుతో "అయ్యా! యెందులకీ తికమకలు నేనొక యుక్తి చెప్పెద

నట్లు చేయుడు. నేఁడు మూఁడరఁటిచెట్లను నాఁటి యొక్కొక్క దానిపై నొక్కొక్కని పేరు వ్రాసెదము. తేపటి యుదయమున కెవరి యరఁటి ఫలించునో వారికి వివాహ మొనర్తుమని చెప్పెను. అందులకా తేఁడు సరియన నట్టులొనర్చిరి.



"రాజు చెయునది లేక యీ పేదవానికిఁ దన కూఁతునిచ్చి వివాహాము చేయించి యిరువురకుఁ దగిన యరణ మిచ్చి పంపివైచెను"

మఱుదినమున నా జడదారి మహిమచే దీర్ఘబాహు పేరుండిన కదళీ వృక్షము ఫలించి యుండెను. రాజు చేయునది లేక యా పేదవానికిఁ దన కూతు నిచ్చి వివాహము చేయించి యిరువురకుఁదగిన యరణమిచ్చి పంపివైచెను.

ఋషియు వారిద్దఱి కరణ్యమున నొక పర్ణశాలఁ జూపి నేను మఱల వచ్చునంతవఱకు నిందు వసింపుచుండుడని యెచ్చటికోపోయెను.

దీర్ఘబాహుడు "నన్ని మునీంద్రుఁ డరణ్యప్రదేశమున నివసింపుమని యనుజ్ఞ యిడుటెందులకు? సర్వేశ్వరుని నిశ్చింతగ ధ్యానించుచుండవచ్చుననియా? అగుగాక పరోపకారమునకంతగ వీలయ్యెడిదికాదె! ఆతఁడు నా మేలుకోరియే నన్నిందు వసింపుమని సెలవిచ్చియుండు. కించిజ్జ్ఞుఁడ నగు నాకది యెట్లు తెలియఁగలదు? ఇందే యుండెదను. పరోపకారము దైవచింతనము మానవునకు ముఖ్యధర్మములు. వానిని వీలగునంతవర కొనర్చువాడే మనుష్యశబ్దవాచ్యుడు" అని యోచించి తనజీవితము నహింసాకరమగు మార్గమునఁ గడప నిశ్చయించెను.

ఆ నూతన దంపతులు కాయగసరులఁ దినుచు చెట్టుబెరడులఁ బొడిసేసి రొట్టెలు చేసికొని యడవిగడ్డల నుడుకఁబెట్టి పొట్టపోసికొనుచుఁ దమకున్నదానితో సంతృప్తహృదయులగుచుండిరి.

పెద్దవాఁడగు బాహుఁడు తాను నదిలోముంచిన పాత్రలోని



జలము పాలుగ మాఱుచుండుటచే నాక్షీరము నమ్మి విశేష ద్రవ్యమార్జించి యా సెలయేటి సామీప్యమున సౌధ మొకటి యేర్పఱచికొని సేవకులు తన కనుసన్నల మెలఁగుచుండ మిగుల నానందించుచుండె. రెండవవాఁడగు సుబాహుఁడు తన పసులమంద నభివృద్ధిపఱచి యనేక గోవుల నమ్మి వచ్చెడు పైకమునంతేయుఁ జేర్చుకొనుచు నొక మేడఁ గట్టించి రెండవ కుబేరునియంతవాఁడనిపించుకొనెను.

వారి యానందజీవితములందు పదివత్సరము లెప్పుడో దొరలిపోయెననుట వారెఱుఁగరైరి. ఒకనాఁడు వారికంత యైశ్వర్యమిచ్చిన తాపసోత్తముఁడు బిచ్చగాని వేసమును ధరించి పెద్దవాఁడగు బాహుని సమీపించెను. అతని కిప్పుడు భూమిపైఁ జూపులానుటలేదు. బలిసిన బసవన్నవలె మెడ పైకెత్తుకొని యతఁ డిటునటు పచారుచేయుచుండెను. భిక్షుకుఁ డతనిఁ జూచి, “మహాశయా! నేను నిఱుపేదను, దాహబాధ తాళజాలకున్నాఁడను, ఒక గిన్నెఁడు పాలను దయచేయుము నీమేలెన్నటికిని మఱవ” ననియెను. ఆతఁ డట్లు యాచింపఁ గనే బాహుఁడు మిక్కిలి కోపోద్దీపితమానసుండై కన్నులుఱిమి “యేమేమి? పాపము! నీకు దాహమునకుఁ బాలుగాక నీరములు సరిపడవా, వచ్చువారికెల్ల నొక్కొక్క గిన్నెఁడు పాల నిచ్చుచుండిన నేనును నీవలె భిక్షాపాత్రఁ బట్టవలసినదేగదా! పొమ్ము, ఇచ్చట నొక నిమిషముగూడ నిలువకుము, నీకుఁ బాలుగాదు పాషాణముపోసెదనుండు” మని యా బికారిని

భయపెట్టుచు మెడఁబట్టి త్రోయుటకు సమీపించెను. అప్పుడా యాచకవేషధారి యగు ఋషి తన నిజరూపమును జూపి, "నాయనా ! నీవు బీదగనుండునపుడే నీకు మంచి గుణము లుండెను. ఇప్పు డవి నశించినవి. భాగ్యముచేరుకొలఁదిని భగవద్భక్తుఁడగుటకు మాఱుగఁ నీకు లోభబుద్ధి పట్టుపడెఁగదా ! లోభము నిన్ను తన సేవకునిగఁ జేసికొనినది ! నీవీ స్థితియందితరులకు సహాయకారివి గాఁజాలవు గావున నీవు మునుపటి వలెనుండు" మనియెను. అతని నోటినుండి మాట వెడలినదే యాలస్యముగ నచ్చటనున్న సౌధములు, ధనరాసులు మొదలగునవన్నియు మాయమయ్యె.

బాహుఁడు మరల నెంత చిన్న పాత్రతో ముంచినను నదీజల మెప్పటియట్లుజలముగనేయుండెను. అతడు తన యహంకారమునకు మిగుల నొచ్చుకొనెను.

రెండవవాఁ డగు సుబాహువు తన యన్నకు దీసిపోక మితిమీఱిన ధనముచే మిగుల గర్వించియుండెను. ఋషీశ్వరుఁ డాతనిని గూడఁ బరీక్షింప నెంచి యొక పేదబాపని వేషమున నతనిం జేరి సవినయమున "ఓ ! ప్రభూ ! నే నొక బీదబాఁపఁడను. నా కేవురు పుత్త్రులు గలరు. వారి కగు దినవెచ్చము లేక మిగుల బాధపడుచున్నాఁడను. మీ రీ నిర్భాగ్యునిపైఁ గనికర ముంచి యొక యావును దాన మిచ్చితిరేని దానివలన మే మందరము మీ పుణ్యమా యని బ్రతుకఁగల" మని

ప్రార్థించెను. సుబాహు వా మాటలను విని తోఁకఁ ద్రొక్కిన త్రాచువలె బుస్సుమని మండిపడుచు, "ఔరా! నీ ధైర్యము! నీ కొక యావు గావలయుఁగా! నీబోటి నీచుల కిచ్చుటకే నే నిచ్చట పసులసంత పెట్టుకొంటి ననుకొంటివా? ఉండుము. నీకు తగు బుద్ధి చెప్పెద" నని లోనికిఁ బోయి యొక చేతి కఱ్ఱను దీసికొని యా యర్థిని గొట్టుటకు వచ్చుచుండెను. అప్పు డా ఋషి తన నిజస్వరూపం బగపఱచి, "నాయనా! ఉండు ముండుము. మరలఁ గొట్టెదవుగాని! నీ గర్వరోగమునకు మం దిచ్చెద. నీ వీ భాగ్యమువలనఁ జెడిపోవుచుంటివి కావున మునుపటివలె బీదవు గ" మ్మనిన తత్క్షణ మచ్చట నున్న గోవు లన్నియుఁ బావురము లయిపోయె. అచ్చట నుండిన మేడ లన్నియు మాయమయ్యెను.

ఇఁక మూఁడవవాఁ డగు దీర్ఘబాహుఁ డెంతటి స్థితిలో నున్నాఁడో చూచెదఁగాక యని యా యతి యొక గ్రుడ్డివాని వేషమున నతనిని సమీపించెను.

దీర్ఘబాహుఁడును నాతని భార్యయు నాఁటిదినమున నెచ్చటనుఁ గావలసినన్ని గడ్డలు దొరకమిచే ఇంటనున్న కొలది గడ్డల నుడుకఁబెట్టి యప్పుడే తినుటకుఁ గూర్చొనుచుండిరి. అప్పు డా యంధుడు వారిని సమీపించి, "అయ్యా! నాకుఁ జాల నాఁకలి యగుచున్నది తినుట కేదేని పెట్టుఁ" డని ప్రార్థించె.

ఆ దంపతులిద్దఱు నా గ్రుడ్డివాని యవస్థకు మిగులఁ జింతించి తమకు లేకున్న మానెనని యూ యుడికిన పెండలముల నాతని కిచ్చిరి. ఆతఁడు వారి దాతృత్వమునకు మెచ్చి తన నిజరూపము నెఱిఁగించి వారికి విశేష సంపదలు గలుగునట్లు దీవించెను. ఆతని మాట ప్రకారము వారి కప్పుడే గొప్ప మేడలును, ధనరాసులును, సేవకబృందము నేర్పడెను. గుణములకుఁ దగిన ఫలితముల వారు పొందిరి.

---

# పరోపకారము

తే. ద్యుమణి పద్మాకరమ్ము ల్వికచముగఁ జేయుఁ
గుముదహర్షంబు గావించు నమృతసూతి
యర్థితుఁడు గాక జల మిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు.

పరోపకారము మిగుల శ్రేష్ఠమగు నియమములలో నొకటి యని మన పెద్దలు పలుమాఱు జెప్పుచుండగ వినియున్నారము. కాని యట్టి పరోపకారచింతనము గలవారు కొద్దిగ నుండుటయు మనము చూచుచున్నారము గదా! మాట లెన్నియేని యాడుట సులభముగాని, యా మాటల ననుసరించి నడుచుకొనుట మిగుల గష్టము. నాయనా! పొగచుట్టలు బీడీలను త్రాగబోకుము నీ సొగసైన ఊపిరితిత్తుల భాగము చెడిపోవునని బోధించు పెద్దలే, కట్టలు కట్టలుగఁ జుట్టలు బీడీలఁ దెగఁ గాల్చుచుండుటలేదా! వారికి బోధించుట సులభసాధ్యమయ్యెనే గాని వారు చెప్పినటులు నడచుకొనుచున్నారో లేదో గమనించుచున్నారా? ఇయ్యదియే గొప్ప గొప్ప ప్రవక్తలకును సాధారణ జనులకు గల భేదము. శ్రీరామచంద్రుఁడు, బుద్ధుఁడు, ఏసుక్రీస్తు, మహమ్మదు మొదలగు మహాత్ములు తామే విషయమును గూర్చి జనులకు బోధించుచుండిరో, దాని ప్రకారమే వారును నడుచుకొని జనుల కాదర్శప్రాయు

లగుచుండిరి. కావుననే వారు చచ్చినను జీవించియున్నవారి పగిది భావించి వారి యపూర్వ జీవితచరిత్రముల మిక్కిలి మక్కువతోఁ బఠించుచున్నారము.

"పరోపకారార్థ మిదం శరీర" మని వీధిరచ్చలపై నెక్కి ముందునకు వెనుకకు నూఁగి యూఁగి చేతులు దట్టితట్టి తలలు త్రిప్పి త్రిప్పి గొంతు కీచుపోవునట్లు బొబ్బలు వెట్టివెట్టి యుపన్యసించువారి నెందఱిని జూచుచుండుటలేదు! వా రట్లుపన్యసించి గృహంబునకుఁ బోయి చేయున దేమి? విస్తరిముందుఁ గూర్చుండి గట్టుమని త్రేన్చుచు "అయ్యా! మూఁడు దినంబుల నుండి పిడికెఁడన్నము లేక మాఁడుచున్నాను. పట్టెఁడోగిర మీ నా దౌర్భాగ్యపుజోలెయందుఁ బడవేయుము తండ్రీ!" అను శబ్దము వినినంతనే, ప్రపంచము మునిఁగిపోయినట్లు తన యిల్లంతయు దోఁచుపోయినట్లు వగర్చుచు గృహకవాటము చెంత కుక్షిబాధచేఁ దపించుచు నిస్సత్తువచే గడగడ వణంకుచున్న యా దిక్కులేని భిక్షుకునికిఁ బట్టెఁడన్నము పెట్టుటకు మాఱు బండెఁడు బండమాటలచే, బైటకు గెంటుటకు వెను దీయఁడుగదా! నాయనలారా! యిట్టిదేనా యాతఁ డిదివఱకు వ్యవహరించిన పరోపకారపారీణత! వృక్షములు సహితము మలమల మాడ్చివేయు నెండలలో కదలక మెదలక నిలిచి త్రోవయందు వేడిమి తాళఁజాలక పోవుచుండు ప్రయాణికుల నాహ్వానించి చల్లని నీడ నిచ్చుచుండుట పరోపకారము

గాదా! దీనంపుఁ జూపులతోఁ జూచుచున్న తన కన్నబిడ్డను విడిచి పులిసిన కుడితిని త్రాగనిడిన తన యజమానునికిఁ దృప్తిగఁ దియ్యని క్షీరంబు లొసఁగు గోవు తనకుఁ గలిగిన దాని నిచ్చుటకు వెనుదీసినదా! ఇట్లెన్నియేని దృష్టాంతము లీయవచ్చును. పరోపకార మనుట మృగములలోనే పుట్టి నప్పుడు మనుష్యులయెడ నింకెట్లేర్పడి యుండవలెను! ఇందు లకు తార్కాణముగ నొకకథ గలదు.

పవిత్రభారతభూమికి వన్నెదెచ్చు ప్రకృతిసిద్ధమగువానిలో గంగానది యొక్కటి. అందు స్నానమాచరించువారి పాపములు నశించునని గట్టినమ్మకమా సేతుహిమాచల పర్యంతము గల హిందువులకుఁ గలదు. అందువలననే శతవృద్ధులుగూడ నోర్మితో ననేక యోజనంబులు ప్రయాణంబొనరించి యానదీ తోయంబుల మునుంగుచుందురు. సాధారణ నదీజలములకును గంగాజలమునకును చాల భేదంబుగలదు. గంగానదిలోని నీరు వేలుగనుంచినఁ జాల కాలమువఱకుఁ జెడక పరిశుభ్రముగ నుండగలదు. మిగిలిన నదులలోని నీరు మూఁడురోజులలోపలనే చెడిపోవుట కారంభించును. అట్టి పవిత్రజలముగల గంగానది కుత్తరమున ననేక సారవంతములగు ప్రదేశములుగలవు. అందు కోసలదేశ మొక్కటి. అచ్చట పచ్చనిపచ్చిక బయళ్లును, సొంపుగనుండు చెఱువులును, నందనములగు వనములునుఁ బెక్కులుగలవు. పరంజ్యోతియను సరస్సు కోసలదేశమునందున్న

సరస్సులలో మిగుల గొప్పది. ఆ చెఱువుగట్టునఁగల పచ్చిక బయళ్ళయందు, జింక లనేకములు నివసించుచుండెను. వాని నన్నిటిని సుధర్ముఁడను జింక పాలించుచుండెను. సుధర్ముఁడు తన గుంపులోని మేటిహరిణములకన్న మిగుల బలిష్ఠుఁడు. అట్లు బలము గలిగియుండియు బలహీనములగు లేళ్ళ నెప్పుడును హింసించి యెరుగఁడు.

ఒకనాఁడా హరిణరాజము పర్వతారణ్యముల విచ్చల విడిగ సంచరింపఁ దోడి పిఱికిమెకములతో బయలువెడలెను. పిల్లలగు లేళ్లు ముద్దుముద్దుగ నెగురుచుఁ దల్లులు తమ వెనుక వచ్చుచున్నవో లేవో తెలిసికొనుట కప్పుడప్పుడు వెనుదిరిగి చూచికొని వానియొద్దకు మరలఁ బరువెత్తుచుఁబోవుచుండెను. వానితల్లులు తమ బిడ్డల ముచ్చటలఁ జూచి సంతసించుచుండెను. నిండుగర్భము ధరించిన జింకలు కొన్ని పరుగెత్త లేక మెల్లమెల్లనఁ దమ భర్తలవెంటఁ బ్రయాణము సాగించుచుండెను. ఇట్లా యిఱ్ఱిసమూహము కొంతదూరంబు నడచి యొక సెలయేటి సమీపముననున్న మఱ్ఱిచెట్టునీడ విశ్రమించెను. సుధర్ముఁడు మాత్ర మట్టి విశ్రాంతిఁగోరక తనగుంపున కేదియు శత్రువులవలన నపాయమురాకుండఁగాపాడ నలు దిక్కులఁ గాచుచుండెను.

అట్టి సమయమున నొక వేటకాఁడు దూరముననుండియే యా జింకలగుంపుఁజూచి ఆహా! నేఁడుగదా! సుదినము.

నేను పుట్టిననాఁటినుండియు నింతటి లేళ్ళమందను జూడనైతిని. ఆ మెకములఁజేనిఁబట్టి మా రాజుకొసఁగితినేని నాకు మంచి బహుమానము దొరకఁగలదు! మిగిలిన జింకలనుబట్టిన మా రాజు బంధువుల కాహారమగును. అయినను నే నొక్కఁడను నన్నిటిని బట్టుట కష్టము గావున మా ప్రభువగు చంద్రసేను నకుఁ జెప్పి పిలుచుకొని వచ్చెదనని యనుకొనుచు నచ్చట నుండి యా మృగయుఁడు పట్టణము దిక్కు పయనమయ్యెను.

మఱుదినమునఁ జంద్రసేనుఁడు వేఁటకానిచే బ్రేరేపింపబడి యా యరణ్యమునకు బయలువెడలెను. అతనివెంట బంధుమిత్రులు హయంబులపై నెక్కి వచ్చిరి. మృగయులు బల్లెములు-బాణములు, ఖడ్గములు, వలలు, ఉరులు, మొదలగు నాయుధములతో డప్పులు, ఢంకాలు, ఝాంకా, మృదంగములు మొదలగు వాద్యంబులతోఁ బయనమయిరి.

వారందఱు నావటవృక్ష సమీపమునకు వచ్చి సరియగు మాటల నేర్పఱచుకొని యచ్చటికి రాఁబోవు మృగములకుఁ దమయునికిఁ దెలియకుండు లాగున నిశ్శబ్దముగ గూర్చుండి యుండిరి.

వారట్లు గూర్చుండి యెంతకాలమో కాలేదు. సుధర్మ సహితముగ నా జింకల గుంపెప్పటి యట్ల మఱ్ఱిచెట్టు నీడను విశ్రమించుటకు వచ్చెను. జింకలన్నియు నానందపరవశములై విహరించు చుండినను నాయకుఁడగు సుధర్ముఁడు మాత్రమా

మిగుల హెచ్చరికతో నలుదిక్కులు తనతలను పైకెత్తి చూచి, కొంత పరివారము తమ్ముఁ జుట్టు ముట్టడించి యుండుట కనుగొనెను.

పాపము! సుధర్ముఁ డిప్పుడేమి చేయగలడు? తన ప్రాణమును గూర్చి యంతగా భయపడుచుండుట లేదు. అట్టి చింత యా ముద్దుముఖమునఁ గనబడుటలేదు. ప్రాణభీతిఁ జెందినటుల తన విశాల చంచల నేత్రము లేమాత్రము సాక్ష్య మిచ్చుటలేదు. ఏదియో కొంతవఱకు యోజించి మరల నలు పార్శ్వములఁ గలయఁ జూచెను. యెటు జూచినను రక్షణోపాయము దోఁపదయ్యెను. తానును మఱికొన్ని బలిష్ఠములగు జింకలును నెదుట మిక్కిలి వేగముగ ప్రవహించుచుండు సెలయేటిని దాఁటి ప్రాణముల రక్షించుకొనఁ గలవు గాని, చిఱుత ప్రాయపు లేళ్ళకు దిక్కెవరు? ముదుసలి మృగముల గతియేమి? చూలుకొనిన హరిణముల బ్రదుకెట్లు? ఈ విషయము లన్నియు సుగుణాత్ముఁడగు సుధర్ముని హృదయమును గలచివైచెను. తన ప్రాణముఁ గాపాడుకొనుట కన్న నితర ప్రాణులఁ గాపాడుటయే ధర్మమని తలచెను. ఉన్నటులుండి తన సమూహము మధ్యభాగమునఁ జొచ్చి యొక వింత సైఁగచేసెను. ఆసైఁగ కర్థము దెలిసినట్లు మిగిలిన జింక లన్నియు లేచి నిశ్శబ్దముగ నిలిచి తమ ముందు బోవుచున్న యజమానుని వెన్నంటెను. సుధర్ముఁడు వడివడిగ నన్నిటికి

న్నముందుగఁ బరువెత్తుచుఁ బోయి తన యెదుటనున్న కొండ కాలువ మధ్యకు దుమికి యందు స్థిరముగ నిలిచి వెనుదిరిగి తనదిక్కు వచ్చుచున్న లేళ్ళ సమూహమునుఁ జూచి మరల నేదియో యొక విధమగు సైగచేసెను. యజమానుని సైఁగ ననుసరించి యొక్కొక్కలేడియు నీవలగట్టునుంచి సుధర్ముని మీఁదికిని నచ్చటనుండి యావలి గట్టునకును ననాయాసముగ దుమికి నిరపాయ స్థితినిఁ బొందుచుండెను, గాని సుధర్ముని స్థితిమాత్రము చాలఁ గష్టముగ నుండెను. ఒక్కొక్క జింక తన మూఁపుపై వేగముగ దుమికినపుడు వాని సన్నని గిట్టలు కత్తిపోటువలెఁ దన శరీరమునఁ గ్రుచ్చుకొని మిగుల బాధించుచుఁ బైనున్న చర్మము కండరముల సహితము చీలుకొని పోవుచుండెను. అంతటి బాధ గలుగుచుండిన నొకరిప్రాణము రక్షింపఁ దన ప్రాణ ముపయోగ పడుచున్నదని యా పావన చరిత్రమగు మృగము బాధకు వెనుదీయక యెప్పటివలె స్థిర చిత్తమున నిలువఁబడి యుండెను.

మందలోని మెకములన్నియు సెలయేటి నవలీలగ దాఁటిఁ దమ నాయకుని నొక శిలవలె జేసుకొని మిక్కిలి సులువుగ యాయురువడిఁగాలువనుదాఁటి యవ్వలిగట్టుఁ జేరఁగల్గెను. సుధర్ముని వీఁపుపై నసంఖ్యాకములగు నాలేళ్ళవాఁడిగొరిజల సంఘటనముచే నెముకవఱకు జీలుకొనిపోయెను. మానవుున కావంతగాయముండి దానిపై గోరంత నలుసు పడిన క్షణము

నసే దూరముననున్న వైద్యుఁడాతని కూతవిని యేమిప్రళయము గలిగినదో యని పరుగెత్తువఱకు బొబ్బలిడునుగదా! అట్లుండ డెక్కలత్రొక్కుడుచే నెంత గాయమయ్యెనో యాగాయముపై వాని కాళ్ళు పడినప్పు డెంత బాధ గలిగియుండునో చెప్పవల నగునా? అట్లు గాయ మొకవఱకు వ్యాపించినను, ఆగాయ ములోని రక్తముచే గిట్టలెఱ్ఱవారి నాలేళ్ళు తనపై దుముకు చుండినను సుధర్ముఁడు వేదనంతయు నోర్చుచుండెను.

గాయము గొప్పది కాకకాన నెత్తురధికముగా నావ్రణము నుండి స్రవించుచుండెను. సుధర్ముఁడు రక్తహీనతచే నికఁ గొన్ని నిముసములకన్న నెక్కుడుగఁ దన ప్రాణములు నిలువ వని గ్రహించెను. నిలుచుటకుఁగూడఁ దనకు సాధ్యమగుచుం డుటలేదు. అట్టి తరుణమునఁగూడ నాజింకలరాయఁడు వెను దిరిగి చూచెను. వ్యాధిపీడితయయి కృశించియున్న యొక యాఁడుజింక మాత్ర ముండెను. అయ్యదిగూడఁ దన ప్రాణ ముల శత్రువు బాధనుండి రక్షింపుమని చెప్పునట్లు దాని ముఖమే చాటుచుండెను. దానిపేరు మాలతి. సుధర్ముఁడు గడ గడ వడంకుచు మాలఁతినిఁజూచి మాలతీ! త్వరగ నీవుగూడ నన్నాధారముగ జేసికొని యావలిదరిఁజేరుము. నేనింకఁజాల కాలము జీవింపలేను. త్వరపడుమని హెచ్చరించెను. ప్రాణము పోనున్న సమయమునఁగూడ మఱియొక ప్రాణిని రక్షించి చచ్చుటయే మేలనియాసారంగము భావించెనుగదా! ఆహా!



ఓ వాలకీ! . . . . . నేనింక చాలకాలము జీవింపలేను త్యాగపడుమని
హెచ్చరించెను.

పరోపకారము నను పట్టిదిగదా! సుధర్ముఁడు తన వారందఱా వలిగట్టుఁ జేరి సురక్షితులైరని తెలిసి సంతసించి గట్టున కతిప్రయాసమునఁ జేరి వెంటనే మరణబాధ మిక్కుటమగుటం జేసి ప్రాణం

బులువిడిచె.

జింకలసమూహము గుణముల బ్రోవగు తమ నాయకుఁడు తమ్ము విడిచి దివి జేరుటచేఁ గన్నుల నీరువెట్టుకొని మిగుల వగఁజెందెను.

ఈచిత్రమునంతయుఁ జెట్ల మఱుగుననుండి చూచుచున్న చంద్రసేనుఁడా సారంగసార్వభౌముని గుణముల కచ్చెరువంది మానవుఁడయ్యుఁ దానంతటి పరోపకారముచేయలేకపోవుటయే గాక నోరులేని యమాయికంబులగు మృగములఁ జంపవచ్చినందులకై మిగుల లజ్జించి వేఁట తమకంబునిఁక దరికి రానీయనని ప్రతినవట్టెను.

---

# ముఖస్తుతి కూడదు.

---

క॥ ఆత్మస్తుతి పరనిందయు
. నాత్మహాననమునకు సమయ ♦ లగుఁగావున నీ
వాత్మస్తుతి గావింపకు
మాత్మ గురుత గోరినిరత ♦ మమలగుణమణీ.

ఉన్నమాట చెప్పిన నందూరు నచ్చిరాదు, కలిగినమాట చెప్పినకంటిలోఁ బొడిచినట్లను సామెత నిక్కువము. ప్రపంచ మంతయుఁ బొగడికలోనున్నది. పొగడుచుండినఁ జాలును. మానవుడు పొట్టలోనికిఁ బాయసము దిగ విడిచినంత సంతస మనుభవించును. ఒక యకార్య మొనరించుచున్న మనుష్యుని గాసంత కూక వెట్టితిమేని అంతటితో మనపని సరి. ఆతఁడు ముష్టి యుద్ధమునకో, అర్ధచంద్ర ప్రయోగమునకో, నాలుక తీట యణఁగునట్టి మాటల పోరునకో సిద్ధపడును.

చేట మూతిచెనటి చంద్రుఁ డనిపించుకొన వలెనని తహ తహ—కూటికిలేని కూళ కుబేరుఁడనిపించుకొనవలెనని కక్కుర్తి. పిల్లి కన్నుల పిసినిగొట్టు ధర్మాత్ముఁ డనిపించుకొనవలెనని తురతుర; నంజుముఖపు నల్లనయ్య మన్మథుఁ డనిపించుకొన వలెనని మటమ; మహిష గుణపు మొద్దయ్యకు నాణెగాఁడని పించుకొనవలెనని సొనసొన. లేని గుణములచేఁ గీర్తింపఁబడ వలెనని ప్రతి మనుజుఁడు ప్రాకులాడుచున్నాఁడు గాని నైజ

గుణ మెట్టిదో కనుఁగొని సరి దిద్దుకొను బుద్ధిలేదు.

ప్రభూ! "తాము చతుస్సముద్ర ముద్రిత రాజ్యము నంతయు నేలు ప్రభువులు!" అని నాలుగెకరములు భూపాలు నొకనినంటి మేని అతఁడుబ్బి తబ్బిబ్బులై వానికి నొక రూకల సంచి నిచ్చుటకు సిద్ధపడుచున్నాఁడు గాని నిజముగ నాల్గెల్లలు గలిగిన యే పాలెమునకునైనఁ దాను పాలకుఁడా యని గమనించుటలేదు. తన్నట్లు పొగడినవాఁడు తానొక లాభము పొందుటకై తన్నట్లు పొగడి నాశనము చేయుచున్నాఁడనుట దెలియలేఁదుగదా!

నాయనా! నీకీర్తి దిగంత విశ్రాంతమని యొకని ననినంతనే ఇఁకఁ జెప్పవలయునా, ఓహో ఆతని కప్పుడే యొకటే పై చూపుగాని సత్యముగ తానట్టి కీర్తి వచ్చుట కేమి చేసితినని యనుకొను చున్నాఁడా!

తండ్రీ ? నీకన్న నాకెవరు, నీవు దానకర్ణుఁడవు. నేను దరిద్రనారాయణుఁడను. దేవుఁడు మనల నిద్దఱనిట్లు జతకూర్చి నాడు. నీవులేకున్న నా జీవితమును, నేను లేకున్న నీకీర్తియు నెగడఁజాలవని యొకఁడనఁగనే! అందెంత సత్యమున్నదో! తమకట్టి దృఢమగు సంబంధ మేమైన నున్నదోయని విచారింపక యే వానికి దోచి పెట్టుటయే యీ కాలపు నడవడి. ఎవఁడేని నాయనా! నీ యందీ తప్పులున్నవి; వానిని బోనడుచు కొనుము; అయ్యది మిగుల శ్రేయస్కరమని నంతనే వాఁడు

మనమీఁద ప్రేమలేక యూరక నిందించుచున్నాఁడని వానినిఁ జూచి మండిపడఁదగునా!

పొగడు వారెట్టివారు? వారలెందుల కట్లు తనలో లేనివి గూడఁ గల్పించి చెప్పుచున్నారో తెలిసికొనువాఁడు సూక్ష్మ బుద్ధిగలవాఁడు. నైజ గుణములను గూర్చిగాని, స్వాభావిక ముగఁ దోఁచినదిగాని యున్నదున్నట్లు స్తోత్రము చేయక చెప్పు ఘనుల యుద్దేశమును గనఁగొనువాఁడు ధన్యాత్ముఁడు. అట్లు యోజింపఁడేని తుదకు చింతిల్లవలసి యుండును. ఇందులకొక కథగలదు.

హిందూదేశమున కామరూప ( Assam ) మను దేశము గలదు. ఆదేశమునకు దక్షిణము కొండలమయమగుటచే నచ్చటి కంతగ రాకపోకలులేవు. అచ్చట చిరపూంజి అను నొక గ్రామము గలదు. ఆ పురమునఁ బ్రపంచమున మఱియెచ్చటను బడని విశేష వర్షము పడుచుండును. కావున నాపరిసర వాసు లందఱు తమ గృహములకుఁ జుట్టును నాల్గయిదు ప్రాకారములఁ గట్టుకొని వసింతురు. ఇట్లు గట్టుకొనుటవలనఁ జలిని నాపనగునని వారి యుద్దేశము. ఆదేశము విశేషపర్వత ప్రదేశమగుటచే చిరపూంజిగూడఁ గొండలలోనే కట్టఁబడినది. అందువలనఁ జూపరులకు గృహములొకదానిపై నొకటి నిర్మించినట్లగపడును. ఆ దేశమునుపాలించు ప్రభుని పేరు పరాంకుశుఁడు. ఆతనికి సుకేశిని, కృష్ణకేశిని, స్వర్ణకేశిని యనుముగ్గురు

కుమార్తెలుండిరి. వారియందతని కెక్కువ ప్రీతి.

ఒకనాఁడా రాజు తన కూఁతుల నందఱఁ బిలిచి "అమ్మలారా! మీరు నన్నెట్లు ప్రేమించుచున్నారు? అని నవ్వుచు నడిగెను. అందులకు జ్యేష్ఠపుత్రియగు సుకేశిని "తండ్రీ! నీకన్న నాకు ప్రేమింపదగువారేరీ? మిమ్ము బంగారుకన్న నెక్కువ ప్రేమింతును" అనియెను. ద్వితీయకుమారియగు కృష్ణకేశిని తండ్రిని జూచి "జనకా! మిమ్మెల నెట్లు ప్రేమింతునో నాకుఁ జెప్పుటకు మాటలు చాలకున్నవి. నారత్నహారము కన్న మిక్కుటముగ మిమ్ముఁ బ్రేమింతు" నని వాక్రుచ్చెను.

కనిష్ఠతనయయగు స్వర్ణకేశిని "నాయనా! తండ్రి నెట్లు ప్రేమింపవలెనో యట్లు ప్రేమించుచుంటిని. మిమ్ము నుప్పుకన్న నెక్కువగ ప్రేమించుచుంటిని" అనియెను. ఆమె తండ్రి కూరలందు విశేష లవణము వాడుకొనుచుండుటచేఁ నామె యిట్లు వచించెను.

మూఁడవ కుమార్తె మాటలు వినినదే రాజున కెక్కువ కోపమువచ్చెను. "ఏమేమీ! నీవు నన్నుప్పుకన్న నెక్కువగ ప్రేమింతువా? నేనంత స్వల్పమగు వస్తువుగ, నీకంటి కగపడుచుంటినా, కానిమ్ము నీకు తండ్రిని బిడ్డ లెట్లు ప్రేమింపవలెనో నేర్చుకొనునట్లు చేసెద" నని యొక సేవకుని బిలచి యీ స్వర్ణకేశిని నరణ్యామధ్యమున విడిచిరమ్మని యాగ్రహామునఁ బల్కెను.

సేవకుఁడు చేయునదిలేక తేని యాజ్ఞానుసారమామెనొకటి నడవికిఁ బిలుచుకొనిపోయి తృప్తిలేనట్టి నృపుని రాజ్యకాంతను వలె, నెడ తెఱపిలేని పిసినారిసంపాదనపుటూహావలెను, విశాలములగు కొమ్మలుగలిగి యూడలబలముతో నెంతయో దూరము వ్యాపించియుండు నొక వటవృక్షముక్రింద నామెను విడిచి వెనుకకు మరలెను.

స్వర్ణకేశిని యొంటిగా నడవియందుఁ జిక్కుటచే "యథార్థవాది బహుజనవిరోధి" యనుట నాయెడ సార్థకమయ్యెఁగదా, ఇంతటికిని నాతండ్రికే నొనరించిన తప్పేమ్యెది? పూర్వజన్మకర్మ మనుభవింపక తప్పించుకొనుట సులభముకాదుగదా యని పరిపరివిధములఁ జింతించుచుండె.

మధ్యాహ్నమగుడు సమీప రాజ్యపాలకుఁడగు నొక భూపాలుఁడు తన గుఱ్ఱముపై స్వారిచేయుచు నామార్గమున వచ్చి యా మఱ్ఱిక్రింద వనదేవతవలెఁ గూర్చుండి యున్న యా సాధ్విని జూచి యామె పుట్టుపూర్వోత్తరంబులఁ దెలిసికొన నామెను బలుకరించెను. స్వర్ణకేశిని తన వృత్తాంతం బంతయుఁ బూసగ్రుచ్చిన ట్లాతని కెఱుకపఱచెను. ఆ నృపుఁడు మిగుల మంచివాఁడగుటచే నామె దీనచరిత్రకు మిక్కిలిగ నొచ్చుకొని ఆకన్నియ సౌందర్యసౌశీల్యములుఁ గల దగుటచే నామెనుఁ దన రాజ్యమునకుఁ బిలుచుకొనిపోయి వివాహమాడెను. మానవుఁ డొకటి తలచిన మాధవుఁడు మఱొకటి



"ఆకన్నియ సౌశీల్యములఁ గలదగుటచే నామెను తన రాజ్యమునకు బిలుచుకొనిపోయి వివాహమాడెను."

గెలుచునా? కీర్తి స్వర్ణకేశిని తన జనకుని తలంపు మేరకు దిక్కు-లేని భిక్షుకురాలుగాక దేవేరి యగుట ఆశ్చర్యముగదా!

పరాంకుశుఁడు మిగుల వృద్ధు డగుచుండుటచే తన ముద్దు బిడ్డలగు సుకేశిని, కృష్ణకేశినుల నిరువురు రాకుమారులకు వివాహము చేయించి వారికి ధనకనకవస్తువాహనంబు లొసఁగి యత్తగా రింటికిఁ బంపివైచెను.

కొన్ని దినములకు పరాంకుశుఁడు శత్రురాజులచే నోడింపఁ బడి తన రాజ్యమునుండి దఱుమఁగొట్టఁబడియె. కావునఁ బరాంకుశప్రభువు పన్నిద్దఱు నమ్మికగల బంటులఁ దనవెంట దోడ్కొని పెద్దకుమార్తెయగు సుకేశిని నగరు చేరెను.

ఆమె తండ్రిని మిగుల నాదరించి అతని కెట్టి లోపము లేకుండులాగునఁ గొలఁది దినములు గడపెను. ఒకనాఁ డామె యతనిని సమీపించి, తండ్రీ మీ కిచ్చట నేలోపమును లేదు గదా! అట్లున్నప్పుడు తమతో గూడ నున్న సేవకులతో మీకు నిమిత్తమేమి? వారికి దండుగఖర్చగుటయే గాని వేఱే యైన లాభము గలదా, మీకు మీ సేవకులే యుండక తప్ప దని భావించెదు పక్షమున వారి సంఖ్యను తగ్గింపుఁడు. మీ శ్రేయము కోరి నే నింతగఁ జెప్పుచుంటి ననియె. అందులకు ముసలిరాజునకు మిక్కిలి కోపము వచ్చెను గాని దాని నడఁచు కొని "కానిమ్ము. ఈ విషయమున యోచన చేసెదనని బదులు చెప్పెను గాని తన బంటుల నెవరిని గాని తన కొలువు నుండి తొలఁగింపలేదు.

సుకేశిని తన మాట తండ్రి త్రోసిపుచ్చెనని మిగులఁ గోపించి ఆతని సేవకులపై నెక్కువగ విసువు చెందుచు వేళకు

సరియగు నాహారమును తండ్రికిఁ బంపక తన్ను రమ్మని జనకుఁ డెన్ని మాఱులు చెప్పి పంపినను నాకుఁ జాల పను లున్నవి, ముసలివాని మహజరు విని మురియుటకన్న మా కేమి యితర కార్యములు లేవా యని యా మగువ ముఖము, ముడివైచు కొని చెప్పి పంపుచుండెడిది.

పరాంకుశుఁడు, తన కూఁతు సాహసమునకును బంగారు కంటె నెక్కువ ప్రేమింతునని కల్లబొల్లిమాటలచేతను బెలించి నందులకును, రాజుగా నుండిన తనకుఁ దుదకుఁ గొద్దిమంది సేవకులఁ బెట్టుకొనుటకుఁ గూడ శక్తి చాలనందులకును మిగుల దుఃఖించి రెండవకూఁతురగు కృష్ణకేశిని గృహంబునకుఁ బయనం బయ్యెను.

ఆ వృద్ధరాజా మె హవేలి ముందునకుఁ బోయి తన తండ్రి వచ్చినాఁ డని చెప్పుమని లోనికి నొక సేవకునిచేఁ జెప్పి పంపెను. అప్పుడు కృష్ణకేశిని తన మగనితో మంతనములాడు చుండెను. తండ్రిరాక ఆమె వినియు విననట్లు నటించుచు నొక గంట తాళి జనకు నెదుర్కొన వచ్చి యాతని లోనికిఁ గొని పోయెను.

మఱుదినమున నామె తండ్రిని జేరి, "అప్పా! నీవు వృద్ధుడ వయితివి! నీ కీ సేవకబృంద మేల? కావలసిన మా సేవకులే మిమ్ముఁ జూడఁగలరు. అట్లు మీరు వారిని బంపివేయుటకు వీలు గాదేని, మీరు బ్రతుకునుపాయము మఱెచ్చటనైనఁ జూచుకొనవలసి యుండు"నని యెను. పరాంకుశుఁడు కోపము

పట్టజాలక నిర్దాక్షిణ్యముగ బలికిన కూతుం జూచి! యేమంటివి నేను నా బ్రతుకుం జూచు తెరవలసి యుండుననియా? ఔనౌను నిన్నంతపెంచి పెద్దగఁ జేసినందులకు నన్ననవలసిన మాట లాడితివి. ఓ ఘాతుకురాలా! నే నిక నొక నిమిషమైన నీయింట నుండనని యచ్చటినుండి వెడలెను. పాపము మొదలే వృద్ధుడు. అందుపై దుఃఖము దానిపైఁ గోపము. ఆవృద్ధశరీరము మూడనదగు కోపభారము మోయఁజాలక గాభోలు దేహమునంతయు గడగడ వణకించుచుండెను. ఈ విశాల ప్రపంచమున రా రాజుగ బ్రతికిన తనకడుపున కంతయన్నమే లేదా! యనియు నీ దుఃఖము లన్నిటిఁ జూడగ గతించిన తన భార్యయే పుణ్యవతి యనియుఁ దలచి బావురుమని బాలకుని చందము నేడ్వఁ దొడఁగెను. అతని తెల్లని గడ్డము కన్నీటి ధారలచే దడసిపోయెను. అదృశ్యమును జూచి కంట దడి వెట్టని సేవకు డొక్కఁడు నందుఁ లేఁడాయె.

తుద కతనిసేవకు లాతని నోదార్పఁ గలిగిరి. రాజును సేవకులును పొరుగురాజ్యము దారిని బోవుచు నారాజ్యపు ముఖ్య పట్టణములోనికిఁ జొచ్చిరి. స్వర్ణకేశిని తన మేడపై వెంట్రుకల నార్చుకొనుచు నా వచ్చెడి గుంపునందుఁ దన తండ్రియుండుట జూచి మిగుల వేగముగఁ గ్రిందికి దిగి తండ్రియొద్దకుఁ బరుగెత్తి యాతని పాదములపై వ్రాలి ఆతఁడట్లు బికారియై వచ్చుటకుఁ గారణము దెలియక మిగుల విలపించెను. పరాంకుశుఁ డామె తన కనిష్ఠ కుమారియని దెలిసి తా నామెకుఁ

చేసిన కీడును మనసునకుఁ దెచ్చుకొని మిగుల వాపోయెను. స్వర్ణకేశిని జనకుని నతని పరివారమును లోనికి మిక్కిలి గౌరవముగఁ దోడ్కొని పోయి వారికిఁ గావలసిన విషయములం దెట్టిలోటు లేక నివారించుచుండెను.

ఇట్లొక సంవత్సరము గడచినఁ దర్వాత నామె భర్తనుఁ బ్రార్థించి యొక గొప్ప సైన్యమును గూర్చుకొని తన తండ్రి రాజ్యమును పరిపాలించు చుండిన శత్రువు నోడించి తన జనకునకు మరల రాజ్యము నప్పగించి యతఁడు కడు వృద్ధుడగుటచే రాజ్యభారము నిర్వహింపఁ జాలడని తనకుమారునచ్చటఁ బ్రతినిధిగనిల్పి తండ్రి సెలవుపొంది తనరాజ్యమునకు మరలెను.

వృద్ధ రాజసేవకులలో నొకడు మాత్రము బంగారు ప్రేమ ప్రభుని బురదలోని కీడ్చినది. రత్నహారపు రాణింపు రాజును రక్కసివలె రొప్పినది. లవణ ప్రేమపు లేమ తేని కష్టములఁ దుడిచి వైచినదని అప్పుడప్పుడు పలుకు చుండెడివాడు.



# మూర్ఖత

విద్యచే భూషితుండయి ♦ వెలయుచున్నఁ
దొడరి వర్జింపనగుఁజుమీ ♦ దుర్జనుండు
చారుమాణిక్యభూషిత ♦ శస్తమస్త
కంబయిన పన్నగము భయం ♦ కరముగాదె.

దున్న యీనినదనినఁ దూడనుఁ గట్టుమనువారు కొందఱు గలరు. వారికి దున్నపోతెచ్చటనైన యీనునాయను యోచన లేదు. కాసంత కక్కుదగ్గునకు కరక్కాయ కూడుదలయనినఁ గోటిరోగములకుఁ గరక్కాయమందనుకొనవలయునా! దీని కంతయుఁ గారణము మూర్ఖతయే.

కొందఱు పెద్దలు చెప్పినటులఁ జేయవలయు ననెదరు. అట్లు చేయుట మంచిదే కాని పెద్దలు చెప్పిన యేయే విషయము నేయే వేళలలోఁ జేసిన సరిపోవునో చూడవలయునా లేదా! వారు చెప్పినది సిద్ధాంతమని యొక్క సూత్రమునే యన్నిటికిఁ బ్రయోగించి యా కార్యము ఫలింపకున్నఁ బెద్దలనుట యొకటే కాని వారు గ్రద్దలకన్న బీదని నిందించువాడు సుద్ధమొద్దేగదా! పెద్దలనుభవపూర్వకముగఁ గొన్ని నియమము లేర్పఱిచిరి. అట్లని "ఆలస్యమమృతంవిషమ్మను" నార్యోక్తి మనస్సునకుఁ దెచ్చుకొని, యెవడో యొక ముక్కు

మొగమెఱుఁగనివాఁడు మనలఁజూచి కొంపలను కాల్చిన బూడిద, పలమొక రూప్యముచొప్పునమ్ముచున్నారనగనే యేమాత్ర మాలస్యమైనను విషతుల్యమని పెద్దలు నుడివిరి గావున వెంటనే మన కొంపలఁ బరశురామప్రీతి గావించుటా! లేక యెట్టి విషయములందాసామెతయాచరణకుఁ దేవలయునా యని యోజించుటా! ఏది యుక్తమో మీరే కనుఁగొనుఁడు.

నిదానమే మహాదానమని గొప్పవారు చెప్పుట కలదని కాలుచున్న కొంపయొద్ద ఉండుగు. నిదానమే దానమని మండుచున్న కప్పుపై నీళ్ళు చల్లకుండుట తగునా! నీటిలో నీతరాని యొక చిఱుతఁడు పడి మునుగుచుఁ దేలుచు రక్షింపుము, తండ్రీ యని యఱచుచుండ నిదానమే దానమని గట్టుపై మిటకరించుకొని చూచుచుండుట బుద్ధిమంతుల లక్షణమా! "తామసించి చేయదగ దెట్టికార్యమని" యొకరు చెప్పిన కొండియములు విని సత్యాసత్యములు దెలియకయే మర్ధింపవచ్చునా! అట్లు విపరీతముగా నడచువారిని మనము చూచి పిచ్చివారని మెదడు లోపమని అనుచున్నాముగదా!

ప్రపంచమున నిట్టి తెలివిలేని పనులు చేయువా రనేకులు గలరు. దీనికి మూర్ఖత్వమే కారణము. వారికెన్ని తెలియఁ జెప్పినను దెలిసికొనక తమకన్నఁ దెలిసినవారు లేరని భ్రమ పడి యొకరు చెప్పుట మనము వినుటయా యని కష్టముల పా లగుదురు. ఒకటే మాట, వారు పట్టినదే పట్టు, వారాడి

నదేయాట, వారు చెప్పినదే వేదము, వారికిలించినదే ఇకిలింపు, వారిమాటయే మాట-ఊహూఁ దానికిఁక తిరుగులేదు-తప్పులేదు—తగ్గులేదు—హెచ్చులేదు. భయంకర విషానల జ్వాలలఁ గ్రక్కు కోడెత్రాచు కాటునకు మందున్నది. భయానక వ్యాఘ్రహాతికి మందున్నది. సదా స్వర్ణ మంత్రము జపించుచుండు లోభియాశకు మందున్నది—గాని పై బేర్కొనిన యవివేకిని బాగుచేయుటకు బ్రహ్మ యయినను గనికరించి యొక మందును సృష్టింపడయ్యె! అట్టి మూర్ఖ బుద్ధిని వదలుకొనుట మిగుల శ్రేయస్కరము లేకున్న వారికి బ్రతికినన్ని దినములును గష్టములే, తుదకుఁ బ్రాణముగూడ నర్పింపవలసి యుండుననుట మీరీ క్రింద నుదహరించి యుండు కథ వలన గనుగొనగలరు.

భరత ఖండమున పూర్వమునుండియు రాజపుత్ర స్థానము చాల గణన కెక్కినది. అందు వీరులగు రాజపుత్రులు వసించుటవలన నా రాజ్యమునకు రాజపుత్రస్థానమని పేరువచ్చెను. ఇయ్యె దిరువదిమంది స్వతంత్ర ప్రభులచే పరిపాలింపఁబడుచున్నది. ఆరావళి పర్వతములును శిల్ప కళానైపుణ్యముఁ జూపు గుహలుగల ఆబూ పర్వతములును యమునా నది కుపనదియగు, చాంబులును, లూనియను, నదులును, తారను నెడారియు నీ దేశమునఁగలవు.

రాజపుత్ర స్థానమున దక్షిణమున మార్వారను గొప్ప

పట్టణముగలదు. అందు వర్తకము చేయువారెద్దులమీఁదనో లొట్టియల మీఁదనో తమ సరకులను, వారికిని వారి వాహనములకును రెండు నెలల వఱకుఁ గావలసిన యాహార నీరములను మృగములపై వైచికొని పంజాబు దేశములోనున్న ముల్టాను నగరమునకుఁ బోయి వ్యాపారము చేసికొనుటగలదు మార్వారు నుండి ముల్టానునకుఁ బోవలయునినఁ తారెడారిని దాఁటవలయును. అందు ప్రయాణము చేయుట మిగులఁ గష్టము. ఆప్రదేశ మెండ వేడిమి యెక్కువయు వర్షము తక్కువయునగు పెక్కువైళ్ల వైశాల్యమగు నిసుకబయలు. అచ్చట చెట్టు చేమలు గాని, గడ్డి, నీరుగాని దొరుకుట దుర్లభము. కావునఁ బ్రయాణికులు తమ వెంట నీరుగూడ దీసికొని పోవలసిన వారగుదురు.

మార్వారుపట్టణమున జయసింహ విజయసింహులను నిద్దఱన్నదమ్ములు గలరు. జయసింహుడు జేష్ఠుడయ్యు మూర్ఖశిఖామణులలోఁ జేర్పవలసినవాఁడే. విజయసింహుడు జయసింహునికన్న చిన్నవాఁడే గాని బుద్ధియందు మాత్రము తన అన్నకన్న మిన్న. వా రిద్దఱు విశేష భాగ్యవంతులు. గావున నితరులవలెఁ దాము వ్యాపారము చేయవలయునని సంకల్పించుకొనిరి.

ఒకనాఁడు తమ్ముఁ డగు విజయసింహుఁడు జయసింహుని జూచి, "అన్నా! మన మనుకొనినటు లిరువది వృషభము

లందులకుఁ దగు సరకులను సిద్ధము చేయించితిని. నీవు కోలఁది సేవకుల సహాయముతో నెడారిని దాఁటి ముల్టానును జేరి కొనుము. నేను రెండుమాసములలోపల ముల్టాను జేరెదను. ఎడారి ప్రయాణమునకు నీవు క్రొత్తవాఁడవు. జాగరూకుఁడవై యుండవలయుఁ జుమీ!" అని సోదరప్రేమ ముట్టిపడ వినయమునఁ జెప్పెను. జయసింహుఁడు పకపక నగుచు "పిల్ల గ్రుడ్డు నెక్కిరించినటులు నాకా నీవు హెచ్చరిక కఱపుట. నీవు తెలివి గలిగి పయనము సాగించినఁ జాలులే" యనియెను.

అనుకొనిన మేరకు జయసింహు డిరువది వృషభముల నిరువది సేవకులను బిలుచుకొని యెద్దులపై సరకులను నీటి కుండలను బెట్టించుకొని ప్రయాణ మాయెను. అతఁ డా యెడారిలో పదిదినములకు వందమైళ్లు పోగల్గెను. ఏప్రక్క జూచినను నీటిజాడయే నగపడుటలేదు. ఎండయూ మాడ్చివైచుచున్నది. అట్టి తరుణమున నొక భూతము మనుష్యరూపము దాల్చి తడి బట్టల ధరించి కొన్ని తామరపుష్పముల చేత నిడుకొని వీరి కెదురుగ వచ్చెను. జయసింహు డాతని జూచి "తా మెచ్చట నుండి వచ్చుచున్నారు? మీ రిప్పుడే నీట మునిఁగి వచ్చిన ట్లున్నది. అంతటి జలాశయ మీ యెడారియం దెచ్చట నున్నదో తెలియఁ జెప్పుఁడు. మా యెద్దులును సేవకులును జాలదినములనుండి స్నానమును శుద్ధజలమును లేక మిగులఁ



“భూతము మనుష్య రూపము దాల్చి తడిబట్టల ధరించి కొన్ని తామర పుష్పముల ... నిడుకొని వీరి కెదురుగ వచ్చెను.”

దపించుచున్నారు. ఈ కొండలలోని నీరెండవేడిమికి క్రాఁగినది యుఁ బ్రాఁతదియు నగుటచేఁ ద్రావఁజాలకున్నార”ని వచించె.

కులును వృషభములును నీటికిఁ దపించుచుండె. కావున వారి కికముందు ప్రయాణ మొక యడుగైన సాగదయ్యె. అదుగో అచ్చట నీరని యెండమావులఁ జూచి నోరు దెఱచుకొని పరుగెత్తి అచ్చట నేమియుఁ గానక మఱొకప్రక్క నున్న మృగతృష్ణ జూచి యది నీ రనుకొని పరుగెత్తి యచ్చటను నేమియుఁ గానక యలసి యొకచోటఁ గూర్చుండిరి.

ఆఁకలి యగుచున్న వారి కడుపుల కింత యన్నము వండుకొందమన్న నీరు లేదు. వా రేమి చేయఁగలరు? ఎండదొర వీరి కష్టములఁ జూచుట కిచ్చగింపనివానింబోలె న స్తమించె. జయసింహుఁడు తా నట్లు మాయదారిచే మోసగింపఁబడినందులకుఁ జాలఁ జింతించెఁ గాని యేమి ఫలము? నీరు పోయిన గుంటకుఁ గట్టకట్టిన నేమి కట్టకున్న నేమి? ఆరాత్రి వారు పరుండియున్న సమయమున ననేక భూతములు కొఱవులఁ బట్టుకొని వచ్చి వీరి నందఱ నెదుర్కొనెను. జయసింహుఁడును సేవకులును నాఁకలి దప్పులచే నీరసిలికే సగము బలము కృశించినవా రగుటచే ఆ పెనుఁగుదెండుల ధాటి కాగలేక మృతి నొందిరి. ఆ కొఱవి తాల్పులు గూడ చచ్చినవారి మాంసముల భుజించి సంతసించె.

మరల రెండుమాసములకు విజయసింహుఁడు ముప్పది వృషభములపై సరకులను నీరును నింపుకొని పదునయిదుగురు సేవకులఁ వెంటఁ బెట్టుకొని యన్న పోయిన మార్గముననే తానును బోయెను. అత డట్లు కొంతదూరము పోయిన వెనుక

మునుపటివలె భూతనాథుఁడు మనుష్యుని రూపమున తామర పూలఁ బట్టుకొని వారి కెదురుగఁ దడిబట్టలతో వచ్చెను.

అతనిని జూచి విజయసింహుఁడు, "ఆర్యా! తా మిప్పు డెచ్చటనో స్నాన మాచరించి వచ్చిన ట్లున్నది. అట్టికొల నీ సమీపమునఁ గలదా" యని ప్రశ్నించెను.

ఆ మానవవేషధారి నవ్వుచు, "అయ్యా! ఇచ్చటికి పడమట మూఁడుమైళ్ల దూరమున నొక దివ్యమగు కొలను గలదు. అచ్చట నీరు త్రావి పరుండియుండ వర్షము గురియ నారంభించెను. అందువలన నా వస్త్రము లన్నియుఁ దడిసినవి. మీ యెద్దులు భారముచే నడవఁజాలకున్నవి. ఆ ఘటములలోని నీరి నంతయుఁ గుమ్మరించిన వానికి దేలిక యగును. త్వరగ మీ రచ్చటికిఁ జేరుకొనఁగలర"ని పల్కి వెడలిపోయెను.

విజయసింహుఁడు జయసింహునంతటి యవివేకిగాఁడు. నిదానమే దానమని పెద్దలందురని ఇట్లు యోజించెను. మూఁడు మైళ్లదూరమునుండి యీ భయంకరమైన యెడారిసీమనుండి వచ్చుచుండియు నితనిబట్టలెండిపోక యిప్పుడే తడిసినవానివలె నీరుగారుటకుఁ గారణమేమి? తామరపువ్వు కొంచెము గూడ వాడినట్లులేదు. ఇప్పుడే వర్షించియుండిన మూఁడుమైళ్లకుండు చల్లనిగాలి యిచ్చటికి రాకమానునా? పడమటి దిక్కున నొక్క మేఘమయినను గన్పడుటలేదే? ఇందేదో మోస మున్నదని కుండలలోని నీరు గుమ్మరింపఁడయ్యె! వా రాఱు మైళ్లు ప్రయాణమొనరించినను మనుష్యవేషధారిచెప్పిన కొల

## అనుబంధములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మృత్యురంగిణి | 0 | 12 | 0 |
| 2 | అభాగిని | 0 | 12 | 0 |
| 3 | ఛద్మవేషి | 0 | 12 | 0 |
| *4 | విదురుని యుపదేశములు | 1 | 0 | 0 |
| *5 | కాంచనమాల | 1 | 0 | 0 |
| †6 | సీమంతిని | 1 | 0 | 0 |
| *7 | సుశీల | 1 | 0 | 0 |
| 8 | శశిరేఖ | 1 | 0 | 0 |
| *9 | యమునాబాయి | 1 | 0 | 0 |
| †10 | శ్యామల | 1 | 0 | 0 |
| 11 | కాంతంకథలు (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| 12 | కాలసర్పి | 1 | 0 | 0 |
| *13 | భారతకథాసారం | 1 | 0 | 0 |
| 14 | కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| 15 | అరక్షణీయ | 1 | 0 | 0 |
| 16 | మాధవి | 0 | 12 | 0 |
| †17 | లలిత | 1 | 0 | 0 |
| †18 | పెండ్లిదండు | 1 | 0 | 0 |
| 19 | కథావళి | 1 | 0 | 0 |
| 20 | నాలుగుకథలు | 1 | 0 | 0 |

పోస్టేజీ పైగా భరించవలెను.

## నా ట క ము లు

| | | | | |
|---|---|---|---|---|
| †1 | మార్కండేయ నాటకము | 0 | 12 | 0 |
| †2 | అహల్యాశాప విమోచనము | 0 | 12 | 0 |
| 3 | విహావారుపతనము | 1 | 0 | 0 |
| 4 | వరమాల | 1 | 0 | 0 |
| 5 | షాజహాను | 1 | 0 | 0 |
| 6 | నూర్జహాను | 1 | 0 | 0 |
| 7 | దుర్గాదాసు | 1 | 0 | 0 |
| 8 | చంద్రగుప్త | 1 | 0 | 0 |

* Approved by M. T. B. C for School use
† ... ... for Libraries



# సరస్వతీ పవర్ ప్రెస్

## రాజమహేంద్రవరము

---

ఈముద్రాయంత్రము భాషాగ్రంధములు తెలుగు— సంస్కృతము—అరవము—ఇంగ్లీషు భాషలలో ముద్రింప నలచువారికి మిక్కిలి యనువుగ నుండును. ఇందు పుస్తకములు చక్కగ సంస్కరించు పండితులు గలరు. మిక్కిలి చక్కగా ముద్రింప దలచువా రందఱు నీముద్రాయంత్రమునం దమగ్రంధములు ముద్రించుట మంచిది. మఱియు నితరములగు నచ్చుపను లన్నియు నిందు మిక్కిలి బాగుగ జేయబడును. అన్ని రకముల అచ్చుపనులు, ఎంగ్రేవింగుపనులు, బైండింగుపనులు మిక్కిలి సుందరముగా జేయబడును.

విశేషాంశములు తెలిసికొనఁగోరువారు—

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారు
సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము

కు వ్రాయవలెను

---

Printed by A. Lakshmanaswamy Naidu
at the Saraswathi Power Press, Rajahmundry. 7527-32.